నలుగురి దారి
నడవని
నలుగురి గాధ








అనుపమ చిత్రం



# ఈడూ జోడూ

నిర్మాత-దర్శకుడు: తిలక్  సంగీతం: పెండ్యాల  పూర్ణా రిలీజ్

SARAGAM  REVATHI

## వదంతులను వినకండి
## వదంతులను ప్రచారం చేయకండి

Studio Roopkala

తప్పక చూడండి



అనురూపా వారి

# అనురాగం

దర్శకత్వం
రామినీడు

నిర్మాతలు
టి.హనుమంతరావు
డి.సూర్యనారాయణ

ఆంధ్ర, సీడెడ్ : విజయ
నైజాం : వాణి

VANAJA

**నవీన తయారీ**

**పిక్‌నిక్ పాకెట్ రేడియో**

జపాను పాకెట్ రేడియో. సిగరెట్ పెట్టెకంటే చిన్నది. తేలికైనది. స్థానికంగా ప్రపంచంలో ప్రతిస్టేషను వినవచ్చును. ఇతర రేడియోల



కంటే తక్కువఖర్చు. సులభముగా ఉంచు కొనుటకుఅనువైనది. అందమైనది. లైసెన్సుతో పాటు ఉపయోగమునకు సిద్ధముగా పంపబడును. 3 సం. గ్యారంటీ. నెం. LR77 ధర రు. 35/-డీలక్స్ రకం నెం. GM 156 ధర. రు. 45–50. వి. పి. పి. చార్జీలు రు. 3–50 అదనం. తోలు కేసు ధర రు.5–50.ఇంగ్లీషులో వ్రాయవలెను.

**KUBER & CO.**

P.O. Box 1268, DELHI-6.

---

**మంచి పుస్తకాలు**

జీవిత రహస్యాలు - మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు:- ...... రూ 3-50

యువతి:- స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు........ రూ 3-50

సంతానము:- గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు.................రూ 3-50

ఉద్యోగ రహస్యాలు.- వ్యాపారంలో లక్షలు సంపాదించే అనేక కొత్తదారులు రూ 6-00

ఉద్యోగదర్శిని - మనదేశంలోని అన్నిరకాల ఉద్యోగాలు, అర్హతలు, పొందే మార్గాలు రూ5-00

ఆత్మజ్ఞానము.- శరీరానంతరం ఆత్మను గురించిన నవీన శాస్త్ర పరిశోధనలు. రూ 2-50

పోష్టు ఖర్చులుచితం క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి పి పోస్టుద్వారా మీఇంటికి పంపబడును.

**దేశసేవ ప్రచురణలు, ఏలూరు, ఆంధ్ర**

---

**మంచి రహస్యం**

**గ్లోరియా** ద్రవాన్ని, మీ ముఖానికి రుద్ది తుడిచినంతలో అద్భుతమైన కాంతిని, మంచి అందాన్ని వెంటనే తెచ్చును ముఖంలోముదిరూపును పోగొట్టి చక్కని లేతదనాన్ని తెచ్చును.ఎండకు వచ్చే నలుపును, మొటిమలను నమ్మకంగా పోగొట్టును వెల రూ.1-75 అన్నిషాపుల్లో దొరకును.

**JANITA PRODUCTS ELURU A.P.**

---

**20 రోజులకు మాత్రము**



తగ్గింపు ధరలు. కాశ్మీర్ బ్యూటీ చేనేత చీరలు. ఒక్కొక్కటి ధర రు 7/50. 2 చీరలు రు 14. 3 చీరలు రు. 20. ఒకే తడవ 3 చీరలు కొనువారికి పోస్టేజి, ప్యాకింగు ఉచితం.

బహుమతులు :- 2 చీరలు కొనువారికి ఒక జత ఇయర్ టాప్స్. 3 చీరలు కొనువారికి ఒక బ్లౌజ్, ఒక జత ఇయర్ టాప్స్. మీ ఆర్డరును వెంటనే పంపండి. మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

THE ROYAL STORES (APM)
Post Box No. 1774, Delhi-6.

---

# శ్రేష్ఠతలో విశిష్టమైన కాఫీ




# ఆంధ్రా కాఫీ యిండస్ట్రీ

**H.O. గుంటూరు-2.**

---

# కుటికురా

# ఆయింట్‌మెంట్

చర్మరక్షణకు శతాబ్దానికి పైగా పేరుమోసింది.




మాట పది సంవత్సరాలు ! ఇంత కాలంగా ప్రపంచమంతటా కుటికురా ఆయింట్‌మెంట్ ఉపయోగంలో ఉందన్న మాట !

కుటికురా ఆయింట్‌మెంట్ మచ్చలు తెచ్చే క్రిములను నాశనంచేస్తుంది. మారేడు కాయలూ, మొటిమలూ మొదలైన వాటిని రూపుమాపి అవి మళ్లీ ఎంతో కాలం వరకు వచ్చే అవకాశం లేకుండా చేస్తుంది. దీనిలోగల క్రిమిసంహార మావెలు, ఒరపును, చమట పొక్కులను, పురుగుల కాట్లనూ నయంచేస్తాయి; కోతలూ, కాల్పులను, గజ్జిని మాన్పుతాయి.

**కుటికురా ఆయింట్‌మెంట్**

కుటికురా టాల్కం పౌడరు డబ్బా కొనండి — కుటుంబానికి అంతటికీ ఉపయోగపడే బహుళ వినియోగ టాల్కం పౌడరు



## కథలు

"మీరు ప్రచురించిన ఈ వారపు పత్రికయందలి "ఆమెకథ" మమ్ముల నెంతో ఆకర్షించింది కాని, శ్రీ వెంకట్రావుగారు కొన్ని విషయాలను నిగూఢముగ యుంచేసినారు రాఘవరావుగారికి తెలిసిన విషయములను విపులీకరించి యుండినచో కథ మరింత బాగుండెడిదేమో!

బి. ఎస్ రమేష్, (బెంగుళూరు

* * *

విడాకులు కథ చదివినకొద్దీ చదవాలని ఉంది దీని రచయిత డి. వి. రావుగార్కి మా అభివందనములు.

డి. కృష్ణమూర్తి (మద్రాసు

## సీరియల్ కథ

తామర కొలను సీరియల్ మొదటినుంచి చదవలేకపోయినను, 10—5—63 సంచిక మొదలు చదివినను అర్థమగునట్లుగా రచించిరి. చదువుచున్నకొద్దీ ఇంకా ఇంకా చదవాలనిపిస్తుంది సీరియల్ చాలా రసవత్తరంగా ఉన్నది. పత్రిక చదవగానే, మరల పత్రికకు ఎదురు చూస్తున్నాను చదువుచున్నకొద్దీ దుఃఖము, ఆతృత మిళితమైన మనస్సుతో ఇంకా ఏం జరుగుతుందా యని ఎదురు చూస్తున్నాను.

పి. తాయిబాబు (రాయలం

* * *

మీరు ఇంత మంచిమంచి కథలు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించుచున్నందులకుగాను మీకు మా అభివందనములు. "తామర కొలను" పత్రికకు చాలా శోభను తెచ్చింది చదువుతున్న పాఠకులను ఉత్తేజపరుస్తుంది. ఇంత మంచి సీరియల్‌ను రచయిత్రిగారు ఎలా ముగిస్తారో తెలియదు. చదువుతున్నకొలది ఎంతో ఉత్సాహంగా ఉన్నది. ఈయొక్క పత్రికకోసము నేను చంద్రుని కోసము చకోరాలు నిరీక్షిస్తున్నట్లు వీక్షిస్తాను.

మోనిక (పార్వతీపురం

* * *

"తామర కొలను" సీరియల్ మాకు చాలా బాగా నచ్చినది. ఇంత మంచి సీరియల్ ప్రచురించిన మీకు, అనువదించిన శర్వాణిగారికి మా ధన్యవాదాలు

ఎస్. కులశేఖరు (కర్నూలు

* * *

శర్వాణివారి కొత్త సీరియల్ 'తామర కొలను'లో రమేష్‌ముందు శాంత టిఫిన్ ప్లేటుంచగా "నేనే రాక్షసుడిని కాను, ఇవన్నీ తినడానికి" అనే మాటలో 'రాక్షసుడిని కాను' అనుటలో అర్థంలేదు

కె. అశ్వర్థ (కళ్యాణదుర్గం

* * *

26—4—63వ తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కుమారి రాణి (తాడేపల్లిగూడెం)గారు శర్వాణిగారి "తామరకొలను" సీరియల్‌లో వదినా మరదులమధ్య సంబోధన సహజంగా లేదని వివరించారు. "తామరకొలను" సీరియల్ కేవలం అనువాదం మాత్రమే. అలాంటి సంబోధనలు మన ఆంధ్రులలో లేకపోవచ్చు. ఇది కన్నడమూలం మూల "శర్వాణి" గారిని విమర్శించుట ఏమంత

# ఉత్తరాలు

సమంజసముగా లేదు అనువాదమనగా ఉన్నదున్నట్లు ఒకభాషలోనికి తర్జుమా చేయుటమే గాని మరొక విధముగా మార్చి వ్రాయరు. పై సూచనతో "రాణి"గారు ఏకీభవించగలరని ఆశిస్తున్నాను.

ముక్కామల మోహనరావు (బందరు

## తెరమీద-తెరవెనుక

ఏమిటో మీ "తెరమీద—వెనుక" శీర్షికలో ఎప్పుడూ ఉన్నవాళ్ళు, ఉండేవాళ్ళని గూర్చే కాని కీర్తిశేషుల మాట కాస్త ఆలోచించారా? చలన చిత్రరంగంలో అనంత కీర్తి నార్జించుకొని దాన్ని మాత్రమే వదలి వెళ్ళిన వాళ్ళెందరులేరు? వాళ్ళను గూర్చి తప్పక వ్రాయాలని కోరుతున్నాము.

వై. శ్రీనివాస్ (అనంతపురం

**ఈ శీర్షిక సజీవులైన వారికి మాత్రమే!**

* * *

పత్రికకు 'తెరమీద— తెరవెనుక' శీర్షిక ప్రారంభించడమే ప్రకాశాన్ని ప్రజ్వలింప చేసింది. పైగా 24—5—63 సంచికలో అభిమాన నటుడు గుమ్మడి పరిచయం మరింత వెలుగు తెచ్చింది. నామరూపాలు శీర్షిక ప్రత్యేకించి బావుంది. పోతే, ఒకే అనుమానం మీరు తెరమీద— తెరవెనుకలో, ఒక్కొక్క వ్యక్తి పరిచయం చేసేందుకు రెండు వారాలు తీసుకుంటారా?

ఆర్. రామచంద్రరావు (పెనుమంట్ర

* * *

ఈ వారం పత్రికలో గుమ్మడి పరిచయం ప్రత్యేక ఆకర్షణ అని చెప్పవచ్చు. ఆతనికి ఏడుగురు పిల్లలన్నా, ఆతని వయస్సు ముప్ఫయిఏడు సంవత్సరాలన్నా నమ్మరాకుండ ఉంది.

గుమ్మడి గురించి ప్రచురించినందుకు మీకు మా ధన్యవాదములు.

కె వి. ప్రభాకర్, నారాయణ (కరీంనగరము

* * *

శ్రీమతి సావిత్రిని పరిచయము చేయుటమ చాలా బాగుంది. కాని, సశేషం అని చూడగానే సంతోషంలో సగం—సంతోషము పోయింది. ఆమె శ్రీమతి కాబట్టి శ్రీవారి ఫోటో మరియు వారి చిరంజీవి ఫోటో వేసినట్లయితే పరిచయానికి ఇంకా వన్నె తెచ్చేది.

శ్రీ వీరాజీగార్ని అభినందించకుండా ఉండలేను. అంతేగాదు; వారు ఇట్లాగే కాంతారావు, జగ్గయ్య, జమున, దేవిక, రాజసులోచన, గిరిజ, యన్. టి. ఆర్ గార్లని కూడ పరిచయములు అందిస్తారని అనుకుంటున్నాను.

కమల (కామ్పూరు

* * *

ఈ వారపు ఆంధ్ర సచిత్ర వారపత్రిక నూతన వధువు రాజసులోచన ముఖ చిత్రముతోడను ఎన్. టి. రామారావు ఫోటోతోడను, ఆహ్లాదకరమైన కథలతోను సర్వాంగసుందరంగా యున్నది.

ఒకచోట జోకులలో రచన "ఎన్. టి. ఆర్. మద్రాస్" అను ప్రచురించితిరి. వారు సినీ నటులు రామారావుగారేనా? ఈ నా సందేహమును తీర్చ గలరు

అబ్దుల్ మజీద్ (ఖమ్మం)

**కాదనుకుంటున్నాము!**

## ఢిల్లీ లేఖ

17—5—63 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురితమైన శ్రీకృష్ణగారి "ఢిల్లీ లేఖ" — ఉత్తరభాగంలో ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలతో నేను ఏకీభవించలేకపోయినప్పటికీ, పూర్వభాగాన్ని మెచ్చుకోకుండా ఉండలేను. నిశితమైన తన అభిప్రాయాన్ని వెల్లడించినందుకు శ్రీకృష్ణగారికి నా ధన్యవాదములు

నిజం చెప్పవలసివస్తే దేశరక్షణకు తమ, తను, మన, ధనాల్ని త్యాగం చెయ్యటానికి భారతీయులెన్నడూ వెనుదియ్యరు. కాని, దురదృష్ట వశాత్తు మన పాలకులు దేశరక్షణకై సరైన విధానాన్ని అవలంబించటం మానివేసి, "రక్షణ" పేరిట ప్రజలను ఎన్నో ఇక్కట్లపాలు చేస్తున్నారు. పైగా వీళ్ళు "గాంధీ మహాత్ముని అనుయాయుల మని గొప్పగా చెప్పుకుంటారు. ఆ గాంధీ మహాత్ముడే పేదవారందరిని ఉద్దేశిస్తూ "లక్షలాది ప్రజానీకం సుఖసంతోషాలను పొందలేదో, వాటిని మనం వాడ త్యజించాలి!" అని బోధచేశాడు ఇప్పుడు వీళ్ళు, కోట్లకొలదీ ప్రజానీకం తమ జీవితాలలో సుఖాన్ని అనుభవించలేరో, వాటిని గురించి ఊహించలేక, అన్నీ అనుభవిస్తున్నారు! ఒక ప్రక్క పొదుపు చెయ్యమంటూ, పగటిపూటకూడ తమ ఇళ్ళలో విద్యుద్దీపాలు వెలిగించుతారు!

చక్కని ఉపన్యాసం ఇవ్వగలిగిన మన మంత్రులు ప్రజాన్ని అంత తేలిగ్గా గుర్తించలేరు. "ఈ పన్నుల భారాన్నంతా మరి ప్రజలే భరించాలి" అని శ్రీ నెహ్రూ ఈ మధ్య వాపోయారు. అవును మరి, ఈ భారాన్ని మోయగలిగినంతవరకు వీరి నిరంకుశ పాలనలో ఉంటూ, ఆ పిదప భరించలేక "జాతి పిత" దగ్గరకు తన అనుయాయులు చేస్తున్న సురాగతాలను వెల్లడించడానికి "పలస" పోతారు! ముక్తకంఠంతో వినవస్తున్న ప్రబలమైన ప్రజావాణిని వినగల్గే చెవులున్నాయా ప్రభుత్వానికి? అనుమానమే!

భాష విషయంలో బెంగాలీ సంగతి! ఆంగ్లభాషా వ్యామోహంలో పడి, సంస్కృతాన్ని కాదనేవరకు పోయారీ మహాభావులు ఇహ హిందీ సంగతి వేరే చెప్పనక్కర్లేదు.

పరిమి సాంబశివరావు (యలమంచిలి)

* * *

సైనికులమైన మేము మీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎప్పుడు వెలువడుతుందా అని ఎదురు చూస్తుంటాము.

జె. డానియల్, నెం. 2553558 ఎ. ఎస్ యం. ఆర్. సి. (నీలగిరి)

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం: 7—6—63
శోభకృన్నామ సం॥ జ్యేష్ఠ మాసం॥ పూర్ణిమ
సంపుటము: 55 సంచిక: 40

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా. రూ. 13.00 ఇతర దేశాలు. ఓడమీద Sea Mail రు. 20.00. (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మని, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు- రూ. 114.00. అమెరికా రూ. 176.50 ఆస్ట్రేలియా 135.00.)

విడిప్రతి: * 25 న.పై.
సంవత్సర చందా: 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1





హీరో కాంతారావ్ [ఫోటో: ప్రభాకర్]

# మనలోమాట

ఈ వారం వనితాలోకంలో కొంచెం కొత్తరకమయిన వ్యాసం ప్రచురించాము. అన్ని రంగాలలోను స్త్రీల పాత్రను చర్చించే రచయితలు సయితం క్రీడారంగాన్ని అశ్రద్ధ చేస్తున్నట్లు, కనిపించే సమయంలో ఈ వ్యాసం ఈ శీర్షికకు కొంతలో కొంత కొత్తదనం చేకూరుస్తున్నదని అనుకుంటున్నాము...

పోయినవారం ఆంధ్ర సచిత్రవార పత్రికలో 'అమెరికాలో ఇండియా వంటలు' వ్యాసరచయిత్రి శ్రీమతి కె. అన్నపూర్ణ ప్రస్తుతం చికాగోలో ఉంటున్నారు...

* * *

భారత దేశంలో కూడా ఊపిరితిత్తులలో పుట్టకురుపు అధికం అవుతున్నదని ఢిల్లీ పటేల్ ఇన్‌స్టిట్యూట్ వారి పరిశోధనలవల్ల ఇటీవలే తెలిసింది. ధూమపానానికీ ఊపిరితిత్తుల కాన్సర్‌కీ సంబంధం ఉన్నదనే విషయం ఇప్పటికి కొంత కాలంగా తెలుసు! అందుచేత ధూమపానంమీద వచ్చే వారమే ఒక వ్యాసం ప్రచురిస్తున్నాము...

* * *

ఈ వారం 'తెరమీద-తెరవెనుక' వ్యక్తి శ్రీమతి రాజసులోచన యిటీవలే శ్రీ సి. ఎస్. రావును వివాహం చేసుకున్నట్లు పాఠకులకు తెలుసును. ఈ వ్యాసం ఈ మెకు ఒక అభినందనగా భావించవచ్చును. పాఠకులు కొంతమందియీ నూతన దంపతుల పెళ్లి ఫోటోను గురించి రాస్తున్నారు.

ఈ వ్యాస సశేష భాగంలో వీలైతే పై వారం ప్రకటించగలమనుకుంటున్నాం. ★

## లోకంపోకడ



దేవుఁడు చల్లగా చూసి నువ్వు నీపాపా అన్నప్రాశనుంచి యింటికి చల్లగాచేరారు ... పిల్లను ఏ తుక్కా నక్కా ఎత్తుకుపోకుండా బయటపడటమే పదివేలు....,

# విషయానుక్రమణిక



ఏ.పి.సి.సి
(ప్రదేశ్ కాంగ్రెస్)
ప్రజలు
డా॥ లోహియాగారు పార్లమెంటు ప్రవేశిస్తున్నారండోయ్... ఇక సందడికి కొదువే వుండదు
పార్లమెంటుకు
అప్రోచ్
జవాబుకై అప్రోచ్ కేసి తిరగండి...
కాంగ్రెస్‌లో
ఓటు
ప్రతిపక్షం



ఇంతవరకు కమ్యూనిస్టు చైనా యుద్ధఖైదీలుగావున్న కొందరు భారత సైనికులు విడుదలైన వెంటనే ఆనందోత్సాహాలతో చప్పట్లు కొడుతూ, పాటలు పాడుతూ నృత్యం చేస్తున్న దృశ్య

# చక్కెర గురించి పాటిల్ ప్రకటన
# బొకారో ఉక్కుకర్మాగారనిర్మాణం పురోగతి

**శ్రీ కృష్ణ**

ప్రణాళికా సంఘం ఆహార ధాన్యం దిగుమతికి సంబంధించినంతవరకు తన పాత ధోరణి అనుసరిస్తోంది. ఇదేం పెద్ద సమస్యకాదు. దేశం పారిశ్రామికంగా అతి త్వరగా అభివృద్ధి పొందుతున్నదంటే, కారణం: అవసర సామగ్రి, పరిశ్రమలకు సంబంధించిన పరికరాలు—మొదలైన వాటి దిగుమతిని నిషేధించటమే. అలాగే ఆహార ధాన్యాల దిగుమతిని నిషేధిస్తే కూడా దేశం ఆహారం సంపాదించుకునే విషయంలో స్వయంసమృద్ధం అవుతుంది. అధికాహారోత్పత్తికిగాను కుక్కగొడుగుల్లాంటి బహుముఖ సంస్థలపైన ఆధారపడకుండా ప్రభుత్వం కొన్నేళ్ళు ఆలోచించి — ఆలోచించి, చివరకు ధరల మద్దతు పథకాన్ని పునఃప్రవేశ పెట్టింది. గోధుమ, వరి ధాన్యాల విషయంలో తన విధానాన్ని ఈవరకే వెల్లడించింది. తెల్ల గోధుమలు మణుగు రు. 9—50, ఎర్రగోధుమలు రు. 8—50 ధరగా నిర్ణయించింది.

ఇక మన కేంద్ర వ్యవసాయమంత్రి శ్రీ యస్. కె. పాటిల్, 1964 సం. లో 16 మిలియన్ టన్నుల గోధుమలు, 1 మిలియన్ టన్నుల బియ్యంను పి. యల్. 480 ఒప్పందం క్రింద పొందేందుకు అధికారం లభించింది.

మొత్తంమీద ఆయన అమెరికా ప్రభుత్వాన్ని అధికంగా ఉత్తరోత్తరా గోధుమల ఎగుమతి అవకాశం, సుమారు 4 మిలియన్ల టన్నుల గోధుమల నిలవకు వీలుంటుందేమో కాస్త కదిపి చూడాలి. విదేశీ దిగుమతులవల్ల 2 మిలియన్ టన్నులు, దేశీయంగా పోగు చేయటంవల్ల 2 మిలియన్ టన్నులు వెరసి 4 మిలియన్ టన్నుల బియ్యపు నిలవలు ఏర్పాటు చేయగలవని వెల్లడించారు; అరబ్ రిపబ్లిక్‌నుంచి 40,000 టన్నుల బియ్యం దిగుమతి చేసుకునే ప్రతిపాదన కూడా ఉంది. ఎకరానికి ఎక్కువ పండించే పథకాన్ని అమెరికా ప్రభుత్వం ఆమోదించుకొనేటట్లయితే, ఇంకా ఎక్కువగా బియ్యం అమెరికా నుండి దిగుమతి చేసుకో వీలౌతుందని ఆయన ఆశ.

జపాన్ పద్ధతిన వ్యవసాయం అమలు జరిపేందుకని శ్రీ పాటిల్ దీర్ఘకాలిక పథకం క్రింద ఓ మారు ప్రయోగాత్మక సంస్థలను నెలకొల్పేందుకు ఆలోచిస్తున్నారు. "ఒక్క రెండేళ్ల లోపల పథకాన్ని అమలు పరచగలిగితే ఇంక శాశ్వతంగా ఆహార సమస్య పరిష్కారం అవుతుంది" అన్నారు.

అమెరికాకు పర్యటనకు వెళ్ళబోయేముందు పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తూ, శ్రీ పాటిల్, ప్రభుత్వం ఏర్పాటు చేసిన చౌక ధరల దుకాణాలలో కొనని వారు మాత్రమే ఎక్కువ డబ్బు పెట్టి కొనుక్కోటం జరిగిందని అన్నారు. అనుకున్న వానిలో ధరలను అదుపు చేయగలంతటి బియ్యపు నిల్వలు దేశంలో ఉన్నాయని కూడా ఆయన చెప్పారు.

చెరకు—గడల ధరలపైన మణుగుకు 6 న. పై. పెంచినట్లు కూడా శ్రీ పాటిల్ చెప్పారు. అయితే ఈ పెరుగుదల ఇప్పటికే కోత కొచ్చిన వాటికి ఏవిధంగానూ ఇబ్బంది కలిగించేటట్లు లేదని అన్నారు. దీనివల్ల వ్యవసాయదారులకు ఉత్సాహం, కాస్త ఊతం ఏర్పడతాయట. "పంటల కోతల సమయంలో చెరుకు తాలుబడి పోవటాన్ని నిరోధించేందుకు చర్యలేమైనా అవసరమైతే, వాటిని గూర్చి కూడా ఆలోచిస్తాం" అన్నారు.

భారత చక్కెర ఉత్పత్తి—రాలల సంఘం సమా

—48 వ పేజీ చూడండి

# నగరంలో తెనుగుతనం తెలియజేస్తున్న సాహిత్య సాంస్కృతిక ప్రదర్శనలు గోష్ఠులు

ఇంకా హైదరాబాదు—పట్నానికి పూర్తిగా తెలుగుతనం అబ్బలేదని చాలామంది విశ్వాసం. ఆంధ్రప్రదేశ్ అవతరించినప్పటినుంచి, ఈ 'తెలుగుతనం' తీసుకు రావటానికి, అనేక విధాలుగా ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. 'సాంస్కృతిక ప్రదర్శనలు, సాహిత్య గోష్ఠులు, దీనికి బాగా దోహదాన్నిస్తున్నాయనటంలో సందేహమేమీలేదు. ఈమధ్య, సినీనటవర్గం ఇచ్చిన కళాత్మకమైన ప్రదర్శనలు, తెలుగుతనానికి నిండుతనం చేకూర్చినాయి. తెలుగునాట అబాలగోపాలాన్ని ముచ్చటగా మురిపించే తెలుగు ప్రముఖ తారలంతా హైదరాబాదు విచ్చేశారు. ఓ బ్రహ్మాండమైన పిక్చర్ షూటింగ్‌కు కాదు. ఉబుసుపోకకు అంతకంటేకాదు. వారి రాక హఠాత్తుగా జరిగిందేమీకాదు! అదుగో వస్తున్నారు అదుగో వస్తున్నారు అంటూ, పదిపదిహేను రోజులబట్టీ, వీరిని గురించి ప్రకటనలే! ప్రచారాలే! చైనా దురాక్రమణను అరికట్టటానికి కావలసిన అతి ముఖ్యమైన 'డబ్బు'ను సేకరించటానికి వచ్చారు. ప్రయోజనాత్మకమైన, కళాత్మకమైన ప్రదర్శనలతో, తమ నటనా చాతుర్యంతో ప్రేక్షక లోకాన్ని ఉద్బోధించి, ఆహ్లాదపరచి, మరీ, వాళ్ళచేత రక్షణనిధికి డబ్బు ఇప్పించారు. ఈ ప్రదర్శనలమూలంగా, ఒక్క హైదరాబాదులోనే మూడు లక్షలకు పైగా వచ్చిందని అంచనా. ఇలాంటిసదుద్దేశంతోనే, ఓసారి, హిందీతారలు ఒక్కుమ్మడిగా వచ్చేసి రకరకాల ప్రదర్శనలు ఇచ్చారు. వీరిమీద ఉన్న మోజు, హైదరాబాదు—ప్రజలకు తెలుగు తారాగణంమీద ఉండదనే నిశ్చితాభిప్రాయం కలిగియున్న, కొంతమంది ప్రజలు, ఈ తెలుగు తారలపట్ల ప్రజానీకం యొక్క ఆసక్తి, ఆప్యాయత, అభిమానాలు చూసేటప్పటికి ఆశ్చర్యచకితులయ్యారు. ఫతే మైదానం, ఆనాడు జనంతో కిక్కిరిసిపోయింది. లోపలికి వెళ్ళి, ప్రదర్శనలు చూడటానికి నోచుకోలేని, ఆర్థిక బాధా పీడితులు, కనీసం, తమ అభిమాన తారల దర్శనమన్నా చేసుకుందామని, బైట గుంపులు గుంపులుగా నిలబడ్డారు. ప్రదర్శనలు కూడా ఉత్తేజకరంగానూ, అత్యవసర పరిస్థితికి అనుగుణంగానూ ఉండటమనేది గమనించతగ్గ విషయం. ఇంకా కొంతమంది ప్రముఖ నటీనటులకు, హైదరాబాదుమీద దృష్టి పడుతోందని వినికిడి. ఇలాంటి పరిస్థితుల్లో, తెలుగుతారలపట్ల హైదరాబాదు—ప్రజలు కనపరచిన శ్రద్ధాసక్తులు, ఒకరిమీద ఒకరికి విశ్వాసం కలుగజేస్తాయనటంలో సందేహంలేదు. ఇలాంటి సుహృద్భావం శుభసూచకమే!

ఇవిట్లా ఉండగా, ఆంధ్ర మహిళా సభవారు తమ నూతన భవనాలకు గృహ ప్రవేశ మహోత్సవాలు జరుపుకున్నారు. ఇరవై ఆరేళ్ళ క్రిందట, మద్రాసులో చిన్న సంస్థగా నెలకొల్పబడ్డ ఈ సంస్థ, యేటేటా అభివృద్ధి చెందుతూ, విస్తృతి చెందిన కార్యకలాపాలతో, భారతావనిలో ప్రముఖ సాంఘిక సంక్షేమ సంస్థగా రూపొందింది. ఆంధ్రప్రదేశ్ అవతరణతో, తమ సంస్థయొక్క విభాగంగా, హైదరాబాదులో కూడా కొన్ని భవనాలు వెలిసినాయి. నూటికి యాభైమంది గల ఈ సభవారు మహిళా లోకంలో చైతన్యం తీసుకు—రావాలని, మహిళలను సుశిక్షితుల్ని చేసి, దేశ సౌభాగ్యాభివృద్ధికి వీరి సేవలుకూడా లభ్యమయ్యేటట్లు చూడాలని ఈ సభయొక్క ఆశయమన్నారు. ఏటేటా రెండు వందలమంది సుశిక్షితులయిన నర్సులను, రెండు వందలమందిని ఉపాధ్యాయినులుగానూ, ఇంకా వందమందికి ఇతర వృత్తులలో తర్ఫీదు ఇచ్చి, దేశానికి సేవచేయ గలుగుతున్నారు. ఇలాంటి సేవాధర్మాన్నే ప్రచారం చేయటంకోసం హైదరాబాదులో కూడా, చేనేత పరిశ్రమాలయం కోసం, విద్యార్థినీ నివాసానికి, హస్త—కళాశిక్షణకు, వేరువేరు భవనాలు నిర్మించారు. ఇవికాక, పెద్ద హాలొకటికూడా కట్టారు. నాలుగు ఎకరాల మేర, ఈ భవనాలు నిర్మించబడ్డాయి. బర్కత్‌పూరా నుంచి ఉస్మానియా యూనివర్సిటీకి వెళ్ళే, రోడ్డుకు ప్రక్కనే, విద్యానగర్‌లో ఈ భవనాలు అతి సుందరంగా వెలిసినాయి. ఒక ప్రక్కనే విజ్ఞానపురి ఉంది. మరోవైపు హిందీ మహా విద్యాలయం ఉంది. ఆక్రమించుకొని, గుడిసెలు వేసుకున్నవారిని, ఇంకో చోటుకు తరలించి, విరాళంగా, ఆంధ్ర మహిళా సభకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ఈ చోటును ఇవ్వటమనేది హర్షనీయమే! అయిదున్నర లక్షలదాకా భారత ప్రభుత్వంవారు ఇవ్వటం జరిగింది. ఇతరత్రా చందాలు వగైరాలతో యెట్లాగయితేనేం, ఇవి నిర్మించారు. అదికూడా తక్కువ వ్యవధిలోనే! సరిపోవటానికి అంతేముంది! సాంఘిక సంక్షేమ సంస్థ అన్నతర్వాత, యెన్ని వసతులు కల్పించినా, ఇంకా కంటికి ఆనినట్టే ఉండదు. ఇప్పుడు తయారయిన హాస్టలులో 180 మంది విద్యార్థినులకే చోటుంటే, 230 దాకా దరఖాస్తుదార్లున్నారుట! మిగతా వారిని కూడా తీసుకోవటానికి తగిన యేర్పాట్లు జరుగుతున్నాయన్నారు. మంచిదే! అయిదేళ్ల నాడు బాబు రాజేంద్ర ప్రసాద్ వెలిగించిన దివ్యజ్యోతిని, ఈ నాటికీ దేదీప్యమానంగా వెలుగొందేటట్లు కాపాడుతూ వస్తున్నారంటే, అన్నింటికీ సారథ్యం వహించిన దుర్గాబాయిగారు అభినందనీయులే! ఉదయం ఎనిమిది గంటలకే, సూర్యుని లేత కిరణాల మధ్య, పెద్ద ముత్తయిదువులు, రంగురంగుల చీరెలతో వనితాలోకం, పళ్ళాలలో, పసుపుకుంకుమలు, తీరుగా అమర్చి, తమ సహజమైన మందయాన నడకలతో, ఊరేగింపుగా నూతన భవనాల దగ్గరకు విచ్చేశారు. ఊరేగింపుకు నాయకత్వం వహించింది దుర్గాబాయిగా రవుతే, నూతన భవనాల గేటు ముందర నిలబడి ఆహ్వానించినవారిలో, చింతామణి దేశముఖ్ గారూ ఉన్నారు. ఉదయమే గృహప్రవేశమైపోయింది. ఆనాటిసాయంత్రమే, భారత రిపబ్లిక్ ఉపాధ్యక్షులు డాక్టర్ జకీర్‌హుస్సేన్‌గారు నూతన భవనాల ఆవిష్కరణ మహోత్సవం కూడా జరిపారు. ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన సభావేదికమీద' శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారు కూడా కనిపించారు. ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారు గాని, ముఖ్యమంత్రి గాని— ఎవరు చెప్పినా, దుర్గాబాయిగారి అచంచల కార్యదీక్ష, పట్టుదల, సమర్థత, ఓపికలను గురించి కొనియాడటమే! ఆమెగారి ధైర్య సాహసాలను గురించి, ఊహాశక్తిని గురించి, డాక్టర్ జకీర్ హుస్సేన్‌గారు ప్రస్తావిస్తూ, ఆమె దూరదృష్టి ద్వారానే, భారతావనిలో, సాంఘిక సంక్షేమ కలాపాల పేరిట, గొప్ప పలుకుబడిని, గౌరవాభిమానాన్ని సంపాదించుకో కలిగిందన్నారు. అసంభవము అనే మాట, ఆమె దృక్పథంలోనే లేదు. ఈ విషయంలో ఆమెగార్ని నెపోలియన్‌తో పోల్చవచ్చని కూడా అన్నారు. ఈ మాట గౌరవ ప్రదమయినదే! ఆమెగారే ఒక పెద్దసంస్థ; ఆమె కేవలం ఒక వ్యక్తేకాదు; మళ్ళీ అనేక సంస్థలకు ఆమె మాతృదేవివంటిదని ముఖ్యమంత్రిగారన్నారు. అసలు ఆమెగా రేమన్నారో కాస్తంత చిత్తగించండి:

ప్రతి పనిలోనూ కష్టమంటూ ఉంటూనే ఉంటుంది. అలాంటి కష్టాల్ని ఎదుర్కొంటూ పనిచేయుటంలోనే సంతోషంఉంది. ఏ పనిలో కష్టంలేదు చెప్పండి! వాటిని అధిగమించి, మనం ముందుకు చొరవ చేసుకుని వెళ్ళాలి అన్నారు ఇది ఆమెగారి కార్యదీక్షకు నిదర్శనం. చదువుకునే రోజుల్లో చదువుకు దూరమయి, బాగా గ్రాహికం తెలిసిన తర్వాత, చదువును వశపరుచుకుని, స్వయంకృషిచేత ఎన్నో పనుల్ని సాధించకుంటూ, నిరంతర కృషిలో నిమగ్నురాలయిపోయిన వ్యక్తి కాబట్టే, అలాంటి మాటలు చెప్ప కలిగింది. మరో మాట: పెద్దవాళ్లయిన వాళ్ళు యెప్పుడూ కూడా వెనకనే ఉంటూ, యువతరం వారికి అవకాశాలు ఇస్తూ, వాళ్లకు తగిన శిక్షణ ఇవ్వాలి. అప్పుడే యే సంస్థయినా బాగుపడటానికి అవకాశం ఉంటుంది. అందువలననే, హైదరాబాద్‌లో మహిళా సభ కార్యకలాపాల్ని యువతులకు అప్పచెప్పేశాను అన్నారు. నిజమే; ఇది అక్షరాల నిజమే! వారు కేవలం ఈ సంస్థ విషయమై ప్రస్తావించినా, ఈ నగ్న—సత్యం ప్రతి చోటా అన్వయిస్తుంది. ఎల్లకాలం, తామే అధికారంలో ఉండాలి; తామే పెత్తనం చెలాయించాలి అని కలలు గంటూ, విపరీత చేష్టలు చేస్తున్న

రాజకీయాధికారులకు ఇదొక చక్కని హెచ్చరిక; గుణపాఠంకూడా. ఇక మూడో మాట: డబ్బు అనేది ఎట్లాగయినా పుట్టించవచ్చు. అయితే, నీతి, నిజాయితీ గల కార్యకర్తలు దొరకటం దుర్లభం. సత్ప్రవర్తన, క్రమశిక్షణ అలవరచుకుంటూ కార్యోన్ముఖులవుతే, మిగతావి వాటంతటవే వస్తాయి అన్నారు. ఆ విధంగానే, సాంఘిక సంక్షేమ సంస్థలో అహర్నిశలు, అవిరళంగా కృషిని జరుపబట్టే, ఈ నాటికీ, యెంతో మందికి జీవనోపాధి కల్పించటమే గాకుండా, యావద్భారతావనిలో ఆదర్శ ప్రాయంగా, ఆమెగారి ఆత్మవిశ్వాసానికి, సేవాధర్మానికి ఈ ఆంధ్ర మహిళా సభ చిహ్నంగా నిలబడ కలిగింది. అలాంటి వ్యక్తి యొక్క సహాయ సహకారాలు, నాయకత్వం లభ్యమవుతున్నాయి కాబట్టి, ఇతర మహిళలు కూడా, వారి అడుగు జాడల్లో నడుస్తూ, ఆదర్శ సభగా చిరస్థాయిగా నిలబడి పోయేటట్లు కృషి చేస్తారనటంలో సందేహం లేదు.

* * *



హైద్రాబాద్‌లో రక్షణనిధి నిమిత్త సినీమాతారలు యిచ్చిన ప్రదర్శనల అనంతరం అంతా కలిసి జన గణ మన గానం చేస్తున్న దృశ్యం.

'సరే గాని, మన పట్నానికి ఓ రష్యన్ సైంటిస్టు వచ్చాడు చూశావా' అన్నాను. 'అవును వచ్చాడని విన్నా. పూర్తి వివరాలవుతే బాగా తెలియవులే. ఎవరేమిటి ఆయన'? 'ఎక్కడ చూసినా, ఆయనకు సన్మానాలే' అన్నాడు. ఆయన పేరు కాన్‌స్టాంటిన్ సెర్గేయేవిచ్. నోరు తిరక్కుండా ఆ పేరేమిటీ అన్నాడు. రష్యాలో ఆయన స్నేహితులు పిలుస్తున్న పేరు. అసలు పేరేమిటో తెలుసా ? కొలచల సీతారామయ్యగారు, ఉయ్యూరు. మరేమనుకున్నావ్ ! అన్నాను శ్రీనివాస్‌తో.

మన ఆంధ్రులకు ఊరు వదిలిపెట్టి వెళ్లటమంటే, మహా బద్ధకం. అందులో కాస్త చెక్క ఉంటే సరి, దాన్నే పిండి, పీల్చి, పిప్పిచేసి దాంతోనే సంతృప్తి పడుతూ ఉంటారు. ఇంటిపట్టున ఉండక యెక్కడికి పోతావురా ! ఏదో స్కూలు—మాస్టరు చేసుకుంటూ నాలుగు ప్రయివేట్లు చెప్పుకుంటే, నీ పొట్ట గడవకపోతుందా ! ఎందుకుతా ఎత్తలేని బరువులు అంటూ, కొత్త ఏమైనా ఆలోచన వస్తే మొదట్లోనే తుంచేస్తారు. సరిగ్గా ఇట్లాగే జరిగింది వీరికి కూడా. అయితే చిన్న క్లాసుల్లో చదువుతున్నప్పటినుంచి ఆయన ఆలోచనలే వేరు వేరుగా ఉండేవి. ఎట్లాగైనా శాస్త్ర పరిశోధనలో చొచ్చుకుపోవాలనే ఆసక్తే, ఆయన్ను ఎంతో ముందుకు తీసుకువెళ్లింది. మదనపల్లి, మద్రాసుల్లో చదువు సాగించాడు. ఆ రోజుల్లో దేశ స్వాతంత్ర్యం కోసం శంఖారావాలు నలుదిక్కులా వినబడుతున్నాయి ప్రజలంతా దేశభక్తి ప్రబోధితులై పరాయి ప్రభుత్వాన్ని పారదోలాలని ఉద్రిక్తులయిపోతున్నారు. అలాంటి స్వాభిమానం సీతారామయ్యగారిలోనూ విజృంభించింది. అయితే, శాస్త్ర పరిశోధనలపట్ల ఆయన మనస్సు మరలలేదు. డిగ్రీ కోర్సు పూర్తిచేసి, విదేశాలకు వెళ్లి ఉన్నతవిద్య నభ్యసించాలనే అభిలాష పట్టుకు పీడిస్తోంది. తనకు వచ్చిన పొలాన్ని కాస్త అమ్మేసుకుని అమెరికా బయలుదేరాడు. అయితే వెళ్లిన కొత్తల్లో ఆయన ఆశలు నిరాశలయినాయి. ఏవేవిటో ఊహించుకుని వెళ్లిన ఆ యువకునికి అనేకచోట్ల ప్రవేశం దొరకలేదు. మనస్సు చికాకుపడింది. నిస్పృహ, నిరాశ ఆవహించినాయి. అయితే వీటిని మించిన పట్టుదల ఆయనది. ఎట్లాగయితేనేమి, అతికష్టంమీద చికాగో యూనివర్సిటీలో ప్రవేశం దొరికింది. ముందు రోజులు ఎట్లా గడుస్తాయో అనే దిగులు పట్టుకుంది. చదువులో నిశితంగా చొచ్చుకుపోతున్నాడే గాని, ఆర్థికంగా తగిన స్తోమత లేకపోయింది. ఏదో సానె—కర్మాగారంలో చిన్న ఉద్యోగానికే సిద్ధపడి కొంతకాలం గడిపాడు. కాని అమెరికాలో ఆయనకు సంతృప్తి కలగలేదు. రష్యా దేశాన్ని గురించి తెలుసుకోవటం మొదలుపెట్టాడు. అనేకమందితో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకుంటూ తన లక్ష్యసిద్ధికి అవిరళ కృషిచేయటం మొదలుపెట్టాడు. ఎట్లాగయితేనేం, రష్యాకు వెళ్లటంజరిగింది. అక్కడ సుప్రసిద్ధ సానెపరిశ్రామిక వేత్తలతోనూ, శాస్త్రపరిశోధకులతోనూ పూర్తి పరిచయం కలిగింది. దేశంలో సానె—పరిశ్రమకు ఉజ్జ్వల భవిష్యత్తుందని గ్రహించి, ఎన్నో పరిశోధనలు చేసి, కొత్త కొత్త విషయాల్ని సాధించాడు. అక్కడ శాస్త్రవేత్తల్లో తగిన గౌరవ మర్యాదలు సంపాదించుకోగలిగాడు. ఆయన పరిశోధనలకు డాక్టరేట్ బిరుదును కూడా తెచ్చుకున్నాడు. మెల్లి మెల్లిగా ఆ దేశంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. సామాన్య కుటుంబంలో జన్మించిన ఓ రష్యా యువతిని పెండ్లాడాడు కూడా. ఇద్దరు పిల్లలు. వాళ్ళ పేర్లు మళ్లీ మన దేశంలోని పేర్లే; లీలావతి, నీలవేణిను. అయితే మన దేశం వదిలిపెట్టి నలభై యేళ్లు అయినా బంధువులతోనూ, స్నేహితులతోనూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే ఉన్నాడు. మాతృభాష మరిచిపోకుండా, తెలుగు పుస్తకాలూ, పత్రికలూ చదువుతూనే ఉంటారు. సుమారు నలభై యేళ్ల తర్వాత ఆయన స్వదేశానికి రావటం ఎంతో ఆశ్చర్యకరంగానూ, సంతోషంగానూ ఉంది. బీగంపేట విమానాశ్రయం దగ్గర ఎంతోమంది ఆప్యాయంగానూ, తనవాడుగానూ ఆహ్వానించారు. 'ఏ దేశ మేగినా, ఎందు కాలిడినా..' గీతం ఆయనలో జీర్ణించుకుపోయినట్లు కనిపిస్తుంది. తన దేశాన్ని, తన మనుష్యుల్ని మళ్ళీ ఇన్నాళ్లకు చూస్తుండేటప్పటికి ఆయన కళ్లు చెమ్మగిలినాయి. ఖాదీమనిషి; దృఢసంకల్పం మూర్తీభవించిన ఆయన ముఖంలో తేజస్సు, గాంభీర్యం ఉట్టిపడుతున్నట్లు కనిపిస్తాయి. కృష్ణదేవరాయ గ్రంథాలయంలో జరిగిన సన్మానసభలో ఆయన తెలుగులో ప్రసంగించటం, చాలమందిని ఆశ్చర్యచకితుల్ని చేసింది. తనని ఇంత ప్రేమగా, ఆప్యాయంగా, స్వదేశానికి ఆహ్వానించినందుకు సంతోషాన్ని, కృతజ్ఞతను వెలిబుచ్చాడు. ఇది నిజంగా కథలాగా ఉంది అన్నాను. 'నేను ఇందాకటి నుంచి కథే అనుకుంటున్నాను' అన్నాడు శ్రీనివాస్ చిరునవ్వుతో.

వి. ఎల్. ఎన్. శర్మ

# కథ కాని కథ

## ఇంటర్వ్యూ

అది నేను ఇంటర్‌లో చేరడానికి యత్నిస్తున్న సమయం. కాలేజిలో జీతమూ అదీ చెల్లించడమయింది. ఇక హాస్టలులో సీటేమైనా ఉంటుందేమోనని వార్డెనుగార్ని కలుసుకుందామని బయలుదేరేసరికి మధ్యాహ్నమైంది. హాస్టలు వద్దకు వెళ్ళి, అక్కడున్న ఒక స్టూడెంటతో, "వార్డెన్‌గారు ఆఫీసులో ఉన్నారా?" అని అడిగాను. అతను వెంటనే (నాతో ఎంతో స్నేహపూర్వకంగా) క్రొత్త విద్యార్థులంతా చాల ఆలస్యంగా తమను కలుసుకొంటున్నందుకు వారు కోపగించుకుంటున్నారనీ, త్వరగా లోపలికి వెళ్ళమనీ చెప్పాడు. నేను కొంచెము జంకుతూ లోపలికి వెళ్ళి, ఆయన్ను 'విష్' చేశాను. వెంటనే నన్ను కుర్చీలో కూర్చోమని సౌంజ్ఞ చేయగా కూర్చున్నాను. అప్పుడాయన మండిపడ్తూ "నిన్ను కుర్చీలో కూర్చోమనగానే 'థ్యాంక్సు' కూడ చెప్పకుండా చతికిలపడ్తావేం? నుంచో ముందు" అని గర్జించారు. తర్వాత నా కభిలాష ఉన్న సబ్జెక్టు ఏదో తెలిసికొని, అందు ప్రశ్నల వడగండ్లు కురిపించగా (ఆ ఆదుర్దాలో) నే నొక్కదానికీ సమాధానం చెప్పలేకపోయాను. వారి నోటినుండి "ఐ విల్ కట్ యువర్ టెయిల్; గో అవుట్" అనే పదాలుకూడ వచ్చి నా చెవికి తాకాయి. అప్పుడు ఆరో ప్రాణంతోనేమో బయటపడ్డాను. ఇంతకూ చెప్పొచ్చే దేమంటారా! ఆ వార్డెను మహాశయుడు ఒక చదువులావేననీ, అసలాయన రీసెస్‌లో బైటికి వెళ్ళారనీ తెలిసింది.

—కోపల్లె మురళీకృష్ణ (బాపట్ల)

* * *

## "మోటోళ్ళు దిగండి"

ఈమధ్య నేను కర్నూల్‌కు పోవలసివచ్చింది. కంభం బస్‌స్టాప్ దగ్గరికి వెళ్లాను. బస్సు వచ్చేదానికి ఇంకా 15 నిమిషాలు టైం ఉండింది. ఆ తర్వాత బస్సొచ్చింది. అందరు గబగబ టికెట్‌లు తీసికొని బస్సెక్కారు. నేను టికెట్ తీసికొని ఎక్కాను. కంభంనుండి కర్నూల్‌కు పోయే దారిలో తాటిచర్లమోటు అనే స్థలమున్నది. కాని, మామూలుగా ప్రజలందరూ దాన్ని మోటు అని అంటుంటారు. ఎవరైనా ప్రయాణికులు అక్కడదిగి చుట్టుపట్ల ఊళ్లకు పోతుంటారు. బస్సు ఆ స్థలం దగ్గరికి వచ్చేసరికి కండక్టరు అలవాటు ప్రకారం 'మోటోళ్లు దిగండి' అన్నాడు. ఇంతలో వెనుక సీటులో నుండి ఒకాయన 'ఇక్కడ అందరూ చదువుకొన్నవాళ్లే' నని రపీమని చెప్పాడు. బస్సులోని ప్రయాణికులు నవ్వకుండ ఉండలేకపోయారు.

యస్. మహబూబ్ పీరాన్ (రాజుపాళెం)

## వింత చదివింపు

ఆ రోజు మా అన్నయ్య పెళ్ళి. సూర్యోదయమయ్యేసరికి పెళ్ళి అయిపోయింది. పందిట్లో హడావిడి కొంచెం తగ్గింది. పెండ్లికుమార్తెకు, పెండ్లికుమారునకు చదివింపులు చదివిస్తున్నారు. నాకు కాళ్లు నొప్పిగా ఉండటంచేత పందిట్లో ఒకమూల ఒక కుర్చీలో కూర్చున్నా. పురోహితుడు వధూవరులకు చదివిస్తున్న చదివింపుల్ని గట్టిగా మైక్‌లో చెబుతున్నాడు. కొందరు రూపాయలు, కొందరు వెండి సామాన్లు, కొందరు పుస్తకాలు, కొందరు వాచీలు చదివిస్తున్నారు. అంతలో 'పెండ్లికుమారునకు వారి మేనల్లుడు చిరంజీవి సురేష్ చదివించినది—ఒక బలపం ముక్క, ఒక్క ఖాళీ సిగరెట్టు పెట్టె, ఒక అగ్గిపెట్టె, (దానిలో రెండు నయాపైసలు, ఒక గండుచీమ ఉన్నాయట) సగం మిఠాయుండ, ఒక చాక్లెట్ కాగితం, రెండు సీతాకోకా చిలుక రెక్కలు,' అని పురోహితుడు మైక్‌లో చెప్పంగానే పందిట్లో వాళ్ళందరూ గొల్లుమని నవ్వారు. నేను లేచి తొందరగా మంటపం దగ్గరికి వెళ్లేసరికే మా అక్కయ్య ఆరేళ్ల కొడుకు సురేష్ ఘనకార్యం చేసినవాడిలాగ ముఖంపెట్టి నవ్వుతూ వస్తున్నాడు.

ఎస్. శేషమాంబ (మద్రాసు)★

# హరివంశము

## ఉజ్జయినీ పర్వం-19

మంగళవాద్యములు భోరన మ్రోగినవి. పెండ్లి పందిరి యంతయు బ్రాహ్మణులచేత, పెండ్లికి వచ్చిన బంధువులచేత, నిబిడమై యున్నది. అది వసంతకాలముగుట పగములో సంక్రమించిన తీవ్ర గ్రీష్మతపములను పోలి, ఎండల వేడిమి సమాక్రాంతముగా పెండ్లి పందిరియందందరును విసనికర్రలను చేతబట్టి విసరుకొనుచుండిరి. మహారాజునకు వేరుగా నాసనము వేయబడినది. ఆయన 'నాకు వేర ఆసన మేల' యన్నాడు. 'ఇది బ్రాహ్మణుల ఇండ్ల పెండ్లి. నే నా పెండ్లికివచ్చితిని. నేనును అందరితోపాటే కూరుచుందును' అన్నాడు. సాందీపనియు, నితరులును కాదన లేకపోయిరి. మహారాజందరితోపాటే, పందిరి యందు వేయబడిన క్రొత్త తాటియాకు చాపలపై కూరుచుండెను. మహారాణి ముత్తైదువులలో కూరుచున్నది. ఆమెకు మహారాజునుచూడగా నవ్వువచ్చినది. ఆయనకు ఎబ్బెరికములు లేవు. క్షత్రియుల కుండవలయు బింకము లేదు. బ్రాహ్మణుల తోడి నిత్యసహవాసమువలన నాయనకును వారి గుణములు చాల భాగమబ్బినవి. ఆయన ఎచ్చట కూర్చున్ననేమి! ఆమె—దృష్టి యంతలో శ్రీకృష్ణదేవుని మీదకు పోయినది. ఆయన తోడ పెండ్లికొడుకగుట నింకను నా పెండ్లికొడుకు వేషమునే యంగీకరించి యున్నాడు. పెండ్లికొడుకునకు మంగళ స్నానమును చేయించినవేళ నాచార్యాణి తోడ పెండ్లికొడుకైన నీ యాదవుల రాచబిడ్డకు గూడా తలయంటి పోసినది. పెండ్లికొడుకు నలంకరించు వంతు తనది కాగా, శ్రీకృష్ణదేవుని యలంకరించు వంతు నామెదైనది. మహారాణి రాజాధిదేవికి తానప్పుడనిన మాట జ్ఞప్తికి వచ్చినది:

"తల్లి ! నేను తండ్రిని అలంకరింతును."

ఆచార్యాణి యప్పుడన్నది:

"తండ్రి యెవ్వరే ! రాజాధి ! మా నాయన నేనా, తండ్రి యనుచున్నావు. వాడు నీకు తండ్రి యగుట యెట్లు ! నీకు వా డల్లుడు. నాకు తండ్రి. నీ ఇంటి కల్లుడై వచ్చిన దినమున వాని నలంకరింతువు గాని" అన్నది.

తన కప్పుడు విచారమో, నవ్వో, ఆనందమో, విషాదమో, ఈ యన్నియు కలిసిన నొకానొక స్థితియో కల్గినది. తాను ఆచార్యాణిని కన్నులలో కన్నులుంచి చూచినది. ఆచార్యాణి శ్రీకృష్ణదేవు నలంకరించుచున్నది. ఆమె తన్ను చూచుచున్నదో, శ్రీకృష్ణుని చూచుచున్నదో ! ఆమె ముఖము మందహాస తరంగ తాడితమై విచిత్రమైన కాంతులతో ముడతలు పడినది. ఆమె మాటాడలేదు. శ్రీకృష్ణదేవుడు మాత్రము గల్లున నవ్వినాడు:

"తల్లి ! అదియేమి ! అత్త, మీరేమో మాటలాడ వలయునని చూచుచున్నది" అనినాడు.

"అవునురా! తండ్రి ! చూచుచున్నది. ఎందకు చూచుచున్నది! నీవు చెప్పుము. నేను చూచెదను. ఓసి ! రాజాధి ! మా తండ్రి కన్నియును తెలియునే! తెలిసియు నన్నిట్లుడికించును" అన్నది.

"నేనా ! మిమ్ములనా ! ఊఁ ఉడికించుచున్నానా? ఇక్కడ మనమే గనుక సరిపోయినది. ఆచార్యులే యున్నచో, నా శిష్యరికమున కీ దినముతో స్వస్తి వాచకము జరిగెడిది."

ఆ మాటలనిన శ్రీకృష్ణుని ఇప్పుడు మరల సభలో చూచినది. అత డే మాట నాడినను అది యతికిన ట్లుండును. అప్పుడాత డా మాటలన్న వేళకు నిజముగా నాచార్యుడు రానే వచ్చెను. తను ఆ యా యుండుట చూచి విచిత్రముగ మందహాసము చేసెను. "ఇంక నేమి ! ఆచార్యాణి కిక లగ్నము వేళ కూడ జ్ఞప్తియందుండదు. ఏమే ! బ్రాహ్మణి ! కుర్రవానికి ముద్దుగా తల దువ్వుచు, కొండి చుట్టుచు కూర్చున్నచో, నచ్చట పీటలమీద నెవరు కూర్చుందురు ! త్వరగా తెమిలి రావలయునని యుండవలయును ! ఏమయ్యా ! శ్రీకృష్ణ ! ఏమందువు" అనినాడు.

శ్రీకృష్ణ డేమి యనెను. ఏమియు ననలేదు. మందహాసము చేసెను : "ఆచార్య ! కథ రసపట్టులో నుండగా మీరు వచ్చినారు. కల్పించుకొనినారు. ఇప్పుడు కథ యడ్డము తిరిగినది. ఏమి ! తల్లి ! మాటాడరు !" అనినాడు.

అప్పుడు ఆచార్యాణిని చూడవలయును. ఆమె యప్పటి స్థితిని తలచుకొనగా నిప్పుడు రాజాధిదేవికి నవ్వు వచ్చినది. సోమిదమ్మవలె భర్త పజ్జను పీటలమీద కూరుచుండిన యామెను చూచినది. ఆమె వృద్ధురాలైన తమ ఇష్టదైవము పార్వతి వలె నున్నది. తలమీద కొప్పు; కొప్పులో నాల్గు మల్లెపూవులు. విశాలమైన ఫాలమున బెత్తెడు కుంకుమబొట్టు. ఆమె కట్టుకొనిన పట్టుచీర ముదురు నీలవర్ణము. ఒంటినిండుగా పమిట చెంగు కప్పుకొని యున్నందువలన నామె సర్వశరీరమును నింద్రనీలమణులచేత నలంకరింపబడినట్లున్నది. కచ్చాపోసి చీరను ధరించినదో, నామె పాదములును, ముఖమును మాత్రమే అనాచ్ఛాదితములై కన్పించుచున్నవి. ఆమె ముఖము విచిత్రమైన యానందముచేత మరియు పవిత్రమై గూడుకట్టిన అమ్మవారి చూపులవలె నున్నది. రాణి యనుకొన్నది: కన్యాదానమును చేసెడి పుణ్యమున్న నిట్లుండునో ! ఆ పుణ్యము తనకును ఉన్నది. కాని ..

ఆమె మనస్సు మరల ఆచార్యాణి యప్పటి స్థితి మీదకు పోయినది. శ్రీకృష్ణు డా మాటనగా ఆమె ఎట్టులైనది ? తల్లక్రిందులైనది. "కథ యడ్డము తిరుగుట యేమిరా ! తండ్రి ! నీ వంతటిమాట యన్నచో, నా బిడ్డలు, రాజును, రాణియు యేమి కావలయును. శ్రీకృష్ణ ! నేను శపించుచున్నాను. కథ యడ్డము తిరుగుటకు వీలులేదు; ఏమందువు ?" అన్నది.

అని, ఆత్రముగ శ్రీకృష్ణదేవుని వంకనే చూచుచు నిలచినది.

శ్రీకృష్ణుడు గల్లున నవ్వినాడు:

"తల్లి ! మీరు ఒకటి యనుటయు, నేను కాదనుటయునా !" అనినాడు.

"అట్టులనుమురా ! తండ్రి ! చూసితివిగదె రాజాధి ! నా తండ్రి నామాటను తీసివేయడమ్మా!" అనినది.

ఆచార్యుడు సాందీపని ఆచార్యాణిని విచిత్రముగా చూచినాడు : "ఓసి ! బ్రాహ్మణి ! నీవు మహా పట్టుదల గల దానవు" అనినాడు. తనను చూచి ఇట్లనినాడు : "రాజాధి ! లోక వృత్తము విచిత్రమైనది. ఏది ఎట్లు జరుగవలయునో, అది అట్లు జరుగును. ఆ జరుగుట కొక్కరితో సంబంధము లేదు. ఇప్పు డొక పని జరుగుటను నీవు చూచితి వనుకొనుము. ఇది ఇట్లు జరుగవలయునని సృష్ట్యారంభమునకు పూర్వమే ఏర్పడి యున్నది. ఒక కార్యము జరుగుట చూచి, ఇది ఇట్టు లెందులకు జరిగినదని విచారింతుము. అనగా నేమి ! ఆ కార్యమునకు గల కారణము అనంతమైన విశ్వమునం దదృష్టముగ నున్నదని యర్థము." అంతియే. ఆయన, తరువాత, లగ్నమునకు వేళ మించుచున్నదని యందరను తొందర చేసినాడు.

రాజాధిదేవి యిప్పుడనుకొన్నది. అప్పుడును అనుకొన్నది. ఆచార్యు డేల తేల్చి మాట్లాడలేదు. ఆయన త్రికాల—వేది. ఆయనకంతయును తెలియును. మిత్రవింద యేమగునో ఆచార్యుని యడుగవలయును.

మరల మంగళ వాద్యములు మొరసినవి. రాజాధిదేవి తన యాలోచనములలోనుండి మేల్కొన్నది. పీటలమీదినుంచి ఆచార్యాణి తన్నెందులకో సంబోధించుచున్నది. ఎందులకో అడుగవలయు ననుకొన్నది. అనుకొనిన యంతలో నాచార్యాణి తన్ను పిలుచుచున్న ట్లయినది. "ఏమి తల్లి!" యనుచు తా నామెను చేరబోయినది.

ఆచార్యాణి యన్నది :

"మీ రందరును ఇట్లు కూర్చున్నచో ఎట్లు ! గౌరీపూజ యెంతవరకైనదో చూచి రావలయును! వలదా ! ఇది యంతయు నా యింటిలోని కార్యము వలె నున్నది."

రాజాధిదేవికి నవ్వు వచ్చినది :

"తల్లి ! మరి ఇది ఎవరి యింటిలోని కార్యము" అని, రాజాధిదేవి మహారాజును చూచినది. "మేము మగ పెండ్లివారము. మహారాజుల సంగతి నాకు తెలియదు. మేము పెండ్లికి వచ్చి కూర్చుందుమే గాని, పనులు చేయము" అన్నది.

మహారా జామెను విచిత్రముగ చూచినాడు : "తల్లి ! రాణివాసపు స్త్రీలు బయటపడినచో నిట్లే మాట్లాడెదరు. వారిని అంతఃపురము వదిలి రానీయరాదు. నేను కొంచెము రాచపోకిళ్లు తక్కువ కాగా ఇది ఇట్టులైనది" అని, శ్రీకృష్ణదేవుని చూచి, "ఏమి యాదవ ! మీ యింటి యాడువారిని చూచుచుంటివిగదా ! మేము వారితో వేగలేకుండా నున్నాము. నీవు మీ గ్రామము పోవు వేళ చెప్పుము. మీ అత్తను మీతో పంపివేసెదను" అనినాడు.

"అట్లనా! మామగారు!" అనినాడు శ్రీకృష్ణుడు.

ఆచార్యాణి యన్నది :

"అత్తవారింటికి వచ్చిన రాచ—స్త్రీ పుట్టినింటి కెట్లు పోవును. వానితో ఎవరిని పంపవలయునో, వారిని పంపుము. మేమును సంతోషించెదము."

పెండ్లిపంధిరియం దందరును ఆనందస్మిత వదనులైనారు. —హారీతశివశర్మ. ★

# తామర కొలను

కన్నడమూలం: త్రివేణి

అనువాదం: శర్వాణి

## జరిగిన కథ

ఆఫీస్ ఉద్యోగి కృష్ణమూర్తి, అతని తమ్ముడు రమేశ్ వైద్యవిద్యార్థి. భార్యపేరు శాంత. రమేశ్ వదిన శాంతకు తలనొప్పి బాధకలిగి ఎన్నిమందు లిచ్చినా తగ్గక చివరికి ఆస్పత్రిలో మరణిస్తుంది. ఆమె మరణంతో రమేశ్ పిచ్చిపట్టినంతగా ఆవేదన పొందుతాడు. అన్న బలవంతం మీద రమేశ్ బొంబాయిలో ఉంటున్న డా. శేషగిరి దగ్గరికి వెళ్తాడు. శేషగిరి భార్య రత్న సాన్నిహిత్యంలో రమేశ్ ఆత్మీయతను పెంపొందించుకుంటాడు.

## 9

ఇప్పటికి వాళ్లు మలబార్ హిల్స్ ఎక్కుతూంటారు. నళిని ఏం మాట్లాడుతోందో ? ఏమైనా మాట్లాడనీ. రమేశుడి మనసును నొప్పించకుండా ఉంటే, చాలు....

"ఏయ్ రత్నా! కలగంటున్నావా ?" అని రెండు మూడు మార్లు హెచ్చరించింది కుముద.

రానురాను కుముద వెళ్ళిపోతే చాలు అనిపించింది రత్నకు. ఆమె మనస్సు అక్కడలేని రమేశ్ వెంట తిరుగుతోంది.

కుముద ఇంటికి వెడతానని లేచినపుడు రత్నకు హాయనిపించింది. కుముద వెళ్ళిపోతే తను నిరాటంకంగా రమేశుడి గురించి ఆలోచించవచ్చుగదూ !

కుముద వెళ్ళిపోయింది. ఏడింటికి ఇంటికి వచ్చిన ఆశా, తల్లి ఇంట్లో ఉండటం చూసి ఆశ్చర్యంతో కళ్ళు పెద్దగా చేసుకుని :

"అమ్మా! ఇంట్లోనే ఉన్నావేం? మామయ్యతో వెళ్ళలేదూ ?" అంది.

"లేదమ్మా, నళిని వెళ్ళింది."

ఆశా తల్లిని వాటేసుకుని:

"ఇకమీదట నళినినే పంపమ్మా మామయ్యతో! నువ్వు వెళ్ళిపోతే నాకేం తోచదు" అంది.

కూతురు—మాట రత్న హృదయాన్ని తాకి గాయపరచింది.

సుమారు ఎనిమిది ఆ ప్రాంతాలలో నళిని, రమేశ్ ఇంటికి వచ్చారు. అంత తొందరగా వారు వచ్చేసినందుకు రత్న ఆశ్చర్యపడినా, రమేశుడిని చూడగానే ఆమెకు శాంతి లభించింది.

"ఏం ఇంత తొందరగా వచ్చేశారు ?"

"పార్కు చూశాం. వచ్చేశాం" అంది నళిని ముక్తసరిగా.

"ఎలా ఉంది మా ఊరి పార్కు" రమేశుడిని అడిగింది రత్న.

"ఉద్యానవనాల సీమనుండి వచ్చినవారు ఆయన. మన ఊరిపార్కు అంతగా నచ్చినట్టు కనిపించలా" అంది నళినే.

తన గదిలోకి వెళ్ళిపోబోతున్న రమేశుడిని రత్న ఆపి "రేపు ఎక్కడికి వెడదాం?" అని అడిగింది.

"అక్వేరియానికి వెడదామని చెప్పాను నేను. లేదా 'విహార్— లేక్‌కు వెళ్ళినా వెళ్ళొచ్చు. రేపు ఆదివారం ఎలామా డాక్టర్‌కు తీరికేకదా. అందరం వెడదాం రత్నా!" అంది నళిని.

"అవునమ్మా. అందరం వెడదాం" అంది ఆశా.

"డాక్టర్ నడిగి రాత్రికి ఏ విషయమూ ఫోన్ చేసి చెపుతాను" అంది రత్న.

ఇద్దరిమధ్యా మూగవాడిలా నిల్చున్న రమేశ్.

"నేనలా తిరిగి వస్తాను" అన్నాడు.

"నేనూ వస్తాను మామయ్యా" అంటూ ఆశకూడా బయల్దేరింది.

ఇద్దరూ కిందికి దిగి వెళ్ళగానే, రత్న కలవరంతో నళిని వైపు తిరిగి.

"ఏమయింది నళినీ ? పాస్, ఫేలా" అంది.

"ఇంత తొందరగా ఎలా చెప్పను ? ఇపుడే ఏమీ చెప్పలేను. చాలా మంచివారిలా కనిపిస్తున్నారు."

నళిని రమేశుడిని మెచ్చుకోవటం రత్నకు ఎంతో ఆనందాన్నిచ్చింది.

"ఎక్కువ మాట్లాడేవారిలా కనిపించలేదు. ఎంత సేపూ నేను మాట్లాడించాలే కాని, అతనయి అతనే నన్ను పలకరించలా, మొత్తంమీద కుతూహలం, ఆసక్తి కలిగించే వ్యక్తిత్వం అతడిది."

"అయితే అతడిని వలపించుకోవటానికి ప్రయత్నిస్తావా ?" రత్న ఆతృతతో అడిగింది.

"ఇపుడే ఏమీ చెప్పలేను. నా ప్రయత్నం అంత తొందరగా మానుకోలేనంత అందగాడతను."

"ఆయనతో ఏం మాట్లాడావ్ ?"

"నా కాలేజి సంగతులూ, ఇపుడు నేను టీచర్‌గా పనిచేస్తున్న స్కూలు విషయాలూ, బొంబాయి జీవితం.... ఇవే, కాని మా సంభాషణలో ఎక్కువపాత్ర నాదే."

రత్న మెల్లిగా 'రమేశ్ ఒక్కసారైనా నీ వైపు మెచ్చుకుంటున్నట్టు చూశాడా ?' అని అడిగింది.

ఈ విషయంలో మట్టుకు నళినికి అసంతృప్తిగా ఉంది. బొంబాయి నాగరిక వాతావరణంలో పెరిగిన గడుసు పిల్ల నళిని. ఎంత మందిలో ఉన్నా కనిపించే లావణ్యవతి.

రమేశుడి ఔదాసీన్యం ఆమె సౌందర్యాన్నే అవమాన పరిచినట్టు నళిని భావించింది. కాని, ఆ ఉదాసీనతే అతడిని మెచ్చుకొనేలా చేసింది. తన సౌందర్యానికి మురవని అతడిని ఏలాగైనా తన వాడినిగా చేసుకోవాలన్న పట్టుదల కలిగింది నళినికి.

నళిని లేచి నిల్చుని "ఇక వస్తాను రత్నా. డాక్టరు వచ్చాక ఫోన్‌చెయ్యి" అంది.

రమేశ్, ఆశా లోపలికి అడుగు పెట్టారు.

నళిని చిరునవ్వు నవ్వి, చేతులు జోడించి "వస్తాను" అంది.

రమేశ్‌కూడా చేతులు జోడించాడు యాంత్రికంగా.

నళిని వెళ్ళిపోగానే రత్న అడిగింది: "పార్కు ఎలా ఉంది ?"

"ఓ మోస్తరుగా ఉంది."

"మా బొంబాయికి చెందిన వాటిని మీరు మెచ్చుకున్నట్టు కనిపించదు. అవునా ?"

"కాదు. మీరు పొరపడుతున్నారు. బొంబాయికి చెందిన రెండు వస్తువులు నాకు చాలా నచ్చాయి."

"ఏమేమిటి" కుతూహలంతో అడిగింది రత్న.

"ఒకటి సముద్రం, ఇంకొకటి సముద్రంలో దొరికే వస్తువు."

"అంటే ?.... ఓ...." రత్న మొహం క్షణమాత్రంలో కెంపులరాశిగా ఎర్రబడిపోయింది.

"నిజం చెప్పండి రత్నా! ఈ రోజు నాతో రాకుండా ఎందుకు తప్పించుకున్నారు ? నన్ను చూస్తే మీకు భయమా ? మీ అనుమతి లేకుండా ఇహ ఎప్పటికీ నిన్నటిలా తొందరపడను. నా తొందరపాటుకు మీరేం శిక్ష విధించినా అనుభవిస్తాను.'

"నిజంగా ?"

రత్న కుడి కనుబొమను పైకెత్తి "నిజంగా?" అన్నపుడు రమేశుడి కంటికి అతిమనోహరంగా కనిపించింది.

"ఊఁ".

రత్న చుట్టూ చూసింది. ఆశ కనిపించలేదు. వేగంగా రమేశుడి దగ్గరగా వచ్చి తనకన్నా ఎత్తుగా ఉన్న అతడి తలను రెండు చేతులతోనూ పట్టుకుని వంచి నుదుటిమీది జుట్టు వెనక్కుతోసి నుదుటిమీద మృదువుగా ముద్దు పెట్టుకుని వెనక్కు జరిగి:

"ఇదే నేను మీకు విధించే శిక్ష" అంది.

"రత్నా ...."

"ఊహుఁ .... ఇక మనం 'సెంటిమెంటల్‌గా' ఉండటం మానేద్దాం."

"రత్నా ...."

"రమేశ్! ఒద్దు. మీకు పుణ్యముంటుంది."

"రత్నా ......"

"మీరు చుట్టిచుట్టి మళ్ళీ అదే విషయానికి వచ్చారంటే, నాకు పిచ్చెత్తుతుంది. దయచేసి ఇంకేమైనా మాట్లాడుకుందాం."

ఆమె—గాంభీర్యం చూసి రమేశ్ మెదలకుండా వూరుకున్నాడు.

"నళిని ఎలాంటి పిల్ల"—రత్న అడిగింది.

"మంచి అమ్మాయే. కొంచెం మాట లెక్కువ."

"చూడటానికి ఎలా ఉంది ?"

"బావుంది."

"అంతేనా ?"

"కాక, నళినిని నాతో షికారుకు పంపటంలో మీ ఉద్దేశ్యం ?"

"దానిలో పెద్ద ఉద్దేశ్య మేముంది ? మీకు మా వాళ్లను పరిచయం చేద్దా మనిపించింది. నళినికి కబురంపాను అంతే."

"నమ్మమంటారా ?"

"నమ్మండి."

శేషగిరి వచ్చాక, రత్న విహార్ లేక్‌కు వెళ్ళే విషయం కదిపింది. కాని, అతడికి ఇలాంటి విషయాల్లో అంత ఆసక్తి ఉండదు.

అతను ఆయాసంతో కళ్ళు మూసుకుని "చూద్దాం" అన్నాడు.

"నళినికి ఏమని చెప్పను ?"

"వెళ్ళేటట్టయితే ఉదయం ఎనిమిదింటికి వాళ్లింటికి వస్తామని చెప్పు."

బాల్కనీలో నిల్చుని వీధివైపు చూస్తున్న

రమేశ్ ఎందుకో వెనక్కు తిరిగి చూశాడు. శేషగిరి, రత్న మాట్లాడుకుంటున్నారు. రత్న మొహంమీద మందహాసం వెలుగుతోంది. పనిచేసి అలసివచ్చిన శేషగిరి అలసటతో కళ్లు మూసుకుని ఉన్నాడు. అతడికి రత్న — మాటలవైపు దృష్టి ఉన్నట్టే లేదు.

కాని, నిరంతరం వెలిగే దీపం — రత్న మందహాసం.

ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, రాత్రి అనే భేదం లేకుండా ఎల్లవేళలా ప్రశాంతంగా వెలిగే నందా దీపం—ఆమె నవ్వు.

ఆశ నేలమీద కూర్చుని ఏదో బొమ్మల పుస్తకం చూసుకుంటోంది.

రమేశ్ కళ్లకు ఓ సుందరమైన చిన్నారి సంసార చిత్రం కనిపించింది.

అతను ఆ సంసారంలోనివాడు కాడు. తనకూ ఆ సంసారానికి ఏవిధమైన బంధుత్వమూ లేదు.

తను అక్కడెందుకుండాలి ?

రమేశుడికి వెంటనే తన వస్తువులు సర్దుకుని చప్పుడు కాకుండా వెళ్లిపోవా లనిపించింది. అతడు రెండు చేతులతోనూ కణతలను అదిమి పట్టుకున్నాడు.

రెండు నిమిషాలు ఆగి, మళ్లీ అటువైపే చూశాడు రమేశ్.

ఈసారి అతడి కళ్లు రత్నమీదే నిలిచాయి.

రత్న, శేషగిరి దగ్గర ఉన్నప్పుడు తనకు పరాయిదానిగా అనిపించేది. తన దగ్గర ఉన్నప్పుడు జన్మజన్మాంతరాల బాంధవి అన్నట్టు స్నేహంగా, ఆత్మీయతతో మెలిగేది.

అది నటనా లేక నిజమైనదా ?

శేషగిరి కళ్లు తెరచి రత్నతో ఏమో చెప్పాడు. రత్న నవ్వుతూ బదులు చెప్పినప్పుడు ..... రమేశ్ హృదయం అసూయతో ఉడికిపోయింది.

తనలో అసూయాగ్ని కణాన్ని రగుల్కొల్పిన రత్నను రమేశ్ ఆ నిమిషంలో బద్ధ శత్రువులా ద్వేషించాడు. అతడు చూస్తూండగానే రత్న వంటింట్లోకి వెళ్లిపోయింది.

"ఆశా! అందర్నీ భోజనానికి రమ్మను" వంటింట్లో నుండి పిలుపు వచ్చింది.

వాళ్లతో కలిసే అధికారం తనకు లేదనిపించి రమేశ్ చీకట్లోనే నిల్చుండిపోయాడు.

44— వ పేజీ చూడండి



# క్రీడారంగంలో స్త్రీలు

## బోడపాటి సుందరి

భారత రాజధానిలో మార్చి 30 న రాష్ట్రపతి భవనంలోని అశోకాహాలువద్ద ఏర్పాటుచేయబడిన ఉత్సవంలో క్రీడాకారులకు ఉద్దేశించబడిన అత్యున్నతమైన బహుకృతి 'అర్జున అవార్డు' శ్రీ రాధాకృష్ణన్, కుమారి 'మీనాషా' కు బహూకరించినప్పుడు ప్రేక్షకులు చేసిన హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి రైల్వేలకు చెందిన కుమారి 'మీనాషా' జాతీయ షటిల్ — బాడ్మింటన్ స్త్రీల సింగిల్స్ బిరుదాన్ని 1959, 60, 61, 62 సంవత్సరాలలో గెలిచి, భారతీయ క్రీడారంగపు చరిత్రలోనే చరిత్ర సృష్టించినది 'ఉబర్ కప్' కై స్త్రీలకు జరిగే అంతర్జాతీయ షటిల్—బాడ్మింటన్ పోటీలలో భారత జట్టుకు ఎమ్ ఏ పట్టభద్రత పొందిన, 26 సంవత్సరాల ఈ మహిళ నాయకురాలు

క్రీడారంగంలో మహిళామణులు సాధించిన విజయాలు సూక్ష్మంగా పేర్కొని 'వనితాలోకం' పాఠకులకు పైవార్త కలిగించినట్లే మరికొంత ఆనందాన్ని కలిగించడానికి, తెలుగు మహిళలకు క్రీడారంగంపై కొంత అభిరుచి కలిగించడానికి ఈ ప్రయత్నం

ఔట్‌డోర్ గేమ్సులో వాలీబాల్, బాస్కెట్ బాల్, హాకీ, బాల్-బాడ్మింటన్, టెన్నిస్—వీటిలో స్త్రీలకు జాతీయ పోటీలు జరుపబడుతున్నాయి బాల్-బాడ్మింటన్ భారతదేశానికే పరిమితమయిన ఆట టెన్నిస్‌లో గాని, మరి ఏ ఇతర ఆటలో గాని అంతర్జాతీయ స్థాయిలో భారత క్రీడాకారిణి లేదు.

స్త్రీలకు జాతీయ 'హాకీ' పోటీలు 1938 లో 'లేడీ రతన్ తాతా కప్' కై ప్రారంభమయినవి స్త్రీల జాతీయ బాస్కెట్‌బాల్ పోటీ విజేతలకు 'బసలత్ కప్' బహూకరిస్తారు

ఇక ఇన్‌డోర్ గేమ్సులో షటిల్—బాడ్మింటన్, టేబిల్ టెన్నిస్ — ఈ రెండు ఆటలలో విశేషంగా భారతీయ స్త్రీలు పాల్గొంటున్నారు. 'ఉబర్ కప్' పోటీలలో భారత జట్టు ప్రశంసించతగ్గ విజయాలు సాధించినది సింహళంలో ఈమధ్య జరిగిన పోటీలలో భారతీయ ఆటగత్తెలు విజయం సాధించారు

టేబిల్ టెన్నిస్‌లో ఆసియా పోటీలలో 'గూల్ నాసిక్‌వాలా' అనే బొంబాయి—మహిళ స్త్రీల సింగిల్స్, డబుల్స్, మిక్స్‌డ్ డబుల్సులో విజయం సాధించి, భారతీయ టేబుల్ టెన్నిస్‌పై చెరగని ముద్ర వేసినది. సయద్ సుల్తానా అనే ఒకనాటి ఆంధ్ర రాజధాని మహిళ పెక్కు పర్యాయాలు భారత టేబుల్ టెన్నిస్ స్త్రీల సింగిల్స్ బిరుదాన్ని నెగ్గి, ఆనాటి ప్రపంచ స్త్రీల ఛాంపియన్ 'ఏంజలికా రోజీనావా' వద్ద ఒక ఎగ్జిబిషన్ పోటీలో ఒక గేము తీసుకున్నది

ప్రస్తుతం రైల్వేలలో పనిచేసే మీనా పరండే, రాచెల్ జాన్, మైసూర్‌కి చెందిన ఉషా సుందర్ రాజ్, బెంగాల్ కి చెందిన ఉషా—అయ్యంగార్, బొంబాయికి చెందిన ఇందిరా — అయ్యంగార్ టేబిల్ టెన్నిస్ క్రీడలో జాతీయ స్థాయిలో పేరుపొందిన వనితలు

ఔట్‌డోర్ గేమ్సులో టెన్నిస్‌లో భారతీయ స్త్రీలు విశేషంగా పాల్గొంటున్నారు మైసూరుకి చెందిన కుమారి డి అప్పయ్య బాలికల పోటీలో పాల్గొంటూ, స్త్రీల జాతీయ సింగిల్స్ బిరుదు సాధించింది

ఇక ట్రాక్ అండ్ ఫీల్డు ఈవెంట్సులో ఆసియా ప్రమాణంలో భారతీయ మహిళలు చెప్పుకోతగ్గ విజయాలు సాధించారు 'మనీలా' లో జరిగిన ద్వితీయ ఆసియా క్రీడోత్సవంలో 4 × 1 రిలే పందెములో కుమారి బ్రౌన్, స్టిఫీడిసౌజా, వైలట్ పీటర్సు, మేరీడిసౌజా గల భారత జట్టుకు సువర్ణ పతకం లభించినది రాజస్థాన్‌కి చెందిన కుమారి ఎలిజబెత్ డవన్ పోర్ట్ 'జావిలన్ త్రో' లో తృతీయ ఆసియా పోటీలలో (టోకియొ) ద్వితీయ స్థానము, చతుర్థ ఆసియా క్రీడోత్సవంలో (జకార్తా) తృతీయ స్థానము ఆక్రమించినది

బొంబాయి వాస్తవ్యురాలు 'మేరీ లీలారావు' పరుగు పందెములలో సాధించిన విజయాలు తెలుగు మహిళకే గర్వకారణాలు ఈమె ప్రస్తుతం అమెరికాలో నున్నది 'స్పాన్' పత్రిక ఈమె గురించి 'సచిత్ర వ్యాసం' ప్రకటించి యున్నది

ఇక అంతర్జాతీయ క్రీడారంగంలో టెన్నిస్ ఆటలో అమెరికా వనితలు, 'ఎమ్. కానోలి', నీగ్రో యువతి అలిథా గిబ్సన్, బ్రెజిల్‌కి చెందిన 'మేరీ బ్యూనో' 'వింబుల్డన్' స్త్రీల ఛాంపియన్‌షిప్ ఒకటికంటె ఎక్కువసార్లు గెలిచారు అమెరికా, బ్రిటన్ దేశాల మధ్య 'వెయిట్‌మన్ కప్' కై ప్రతి సంవత్సరం జరిగే టెన్నిస్ పోటీ ఆ రెండు దేశాలకే పరిమితం కాకుండా, 'ప్రపంచ టెన్నిస్ దేశాలు' అన్నీ పాల్గొనే అవకాశం కలిగించాలనే ఆలోచన కార్యరూపం దాలుస్తే మంచిది

రష్యా, అమెరికా స్త్రీలు ఒలింపిక్ పోటీలలో ట్రాక్ అండ్ ఫీల్డు ఈవెంట్సులో తమ ఆధిపత్యానికి తిరుగులేదని నిరూపించుకుంటున్నారు. భారతీయ మహిళల స్థాయి వారి స్థాయి కంటె ఎంతో వెనుకబడి యున్నది

మద్రాసుకు చెందిన గుణసుందరి ఫేమ్ తార టి జి కమలాదేవి ప్రఖ్యాత బిలియర్డ్సు ఆటగత్తె అని కొద్దిమందికి మాత్రమే తెల్సు

ఇంగ్లీషు ఛానల్ ఈదిన ప్రథమ భారతీయ మహిళ కలకత్తాకి చెందిన 'ఆరతి షా'

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాద్ లోనే కాకుండా, ఇతర పట్టణాలలో కూడా అనేక మహిళా సంఘాలు ఉన్నాయి రింగ్ టెన్నిస్, బాల్ బాడ్మిన్‌టన్, టేబిల్ టెన్నిస్‌వంటి ఆటలు ఆడటానికి వారు ప్రయత్నిస్తే, పెద్ద పోటీలలో పాల్గొని రాష్ట్రానికి, దేశానికి కీర్తి తెచ్చే మాట అటుంచి, నిస్సందేహంగా అది ఆరోగ్యానికి ఉత్తమమైన కాలక్షేపం కాగలదు. 



'అంగారక గ్రహమా ?... అదా ? ఇది కదా ? అంగారక గ్రహం !!?'

# వ ని తా వా ణి

## వంటా - వడ్డనా

సావిత్రిగారు రాసినట్లు చాలామంది వంట వండుతారు కాని, వడ్డించలేరు. అలాటి వారికి ఈమె చెప్పిన ఉపాయం బాగుంది. కావున అన్ని వస్తువులను ముందుగానే అమర్చుకొని, భోజనము చేసే వారికి వడ్డిస్తే బాగుండి, తినే వారికి తృప్తిగా ఉంటుంది.

కుమారి ఎమ్. మీనాక్షి (పాలకొండ)

* * *

పి. సావిత్రిగారు వ్రాసిన వంట—వడ్డన నాకు నచ్చింది. ఇది చదివైనా అందరూ వడ్డించటము బాగా నేర్చుకుంటారని ఆశిస్తున్నాను. వారికి నా అభినందనలు.

కుమారి పి. రాజేశ్వరి (కృష్ణా సిమెంటు కాలనీ) ★

## వ ం ట లు

### ఇడియాప్పం

కావలసిన వస్తువులు : బియ్యపు పిండి 1 అర్ధాకు, ఉప్పు: పావు చెంచాడు.

బియ్యపుపిండి తయారుచేసేవిధం: అర అర్ధాకు పచ్చిబియ్యం నీళ్ళల్లో పోసి, సుమారు రెండు గంటలపాటు నానబెట్టాలి. తర్వాత నీరు తీసివేసి బియ్యాన్ని దంచి పిండిగా కొట్టాలి. బాగా పొడిబారేదాకా పిండిని ఆరబెట్టాలి.

ఈ విధంగా తయారైన పిండిని ఓ అరశాకు నీళ్ళల్లో పోసి, కాస్త అంటే పావుచెంచా ఉప్పువేసి, బాగా ఉడకబెట్టాలి. వత్తితే కారపుపూసలాగా వచ్చేందుకు వీలయ్యేంత మెత్తగా పిండి తయారయ్యేదాకా నీళ్ళు పోస్తూ ఉండాలి. అలా,పిండి ముద్దగా తయారయిం తర్వాత దీన్ని కారపుపూసవత్తేగొట్టాలలో వేసి, ఓ పల్చని తడిగుడ్డ మీద గుండ్రంగా వత్తుకోవాలి. కారపుపూస ఆకారంలోనే ఇవి కూడా ఉంటాయి. వీటిని నీటి ఆవిరిమీద ఉడకబెట్టాలి.

★

## చదువ ల్రావ - బి. వి. సత్యమూర్తి











# తెలియని విలువలు

ఆర్. సీతారామారావు

'అన్నయ్యకు!

కొన్నాళ్ళ క్రితం ఇల్లు వదిలి వెళ్ళిన నీకు ఇప్పుడు ఉత్తరం వ్రాస్తున్నాను నన్ను లాలించి, ప్రేమించిన అన్నయ్యా, మమ్మల్నందర్నీ వదిలి వెళ్ళాడనే విచారం తప్ప, జీవితంలో ఇంకే మనఃక్లేశమూ లేకుండ సుఖంగా కాలం గడిపాను.

నా అదృష్టం కొద్దీ, పూర్వజన్మలో చేసుకున్న పుణ్య సుకృతం కొద్దీ, నన్ను ఆదరాభిమానాలతో ప్రేమించే భర్త దొరకటం, దానికితోడు హోదా, దర్జా ఉన్న ఉద్యోగం ఆయనకు లభించడం! మొత్తానికి నా జీవితం సుఖ సంతోషాలకు నిలయమై పోయింది!

అన్నయ్యా! మమ్మల్నందర్నీ కాదని వెళ్ళిపోయి నీవు సాధించిన దేమిటి? అమ్మకూ, నాన్నకూ హృదయాల్లో విచారపు జ్యోతులను వెలిగించటం తప్ప!—నీవు విడిచిపెట్టి వెళ్ళినందుకు నాన్న ఎంత విచారపడ్డాడు? అమ్మ గుండె—బ్రద్దలయ్యేటట్లు ఏడ్చింది జీవితం అంతా ఆ విధంగా గడిపి, చివరి నిముషం వరకూ నిన్ను గురించే కలవరిస్తూ, మనల్ని వదిలి శాశ్వతంగా వెళ్ళిపోయారు నీ పట్టుదల నెగ్గటానికే చూసుకున్నావు గానీ, ఇతర విషయాలు ఆలోచించావుకావు! అనేక కట్టుబాట్లున్న ఈ దేశంలో పుట్టిన మనం ఒక్కసారిగా బంధనాలను తెంపేసుకొని విముక్తి పొందాలనుకోవడం కేవలం హాస్యాస్పదం! కాలం న్యాయాన్ని నిర్ణయించేంతవరకూ పరిస్థితులకు అణిగి మణిగి ఉండటం మన విధి!

కానీ, ఏం లాభం?

ఆనంద సాగరంలో విషాదపు బొట్టును నిర్దయగా రాల్చి, అమృతాన్ని హాలాహలంగా మార్చిన నీవు, నీ పట్టుదల నెరవేరినందుకూ, నీ ఆశయాలు సఫలీకృతమైనందుకూ సంతోషపడిఉండవచ్చు!

నిన్ను వదిలి ఎన్నడూ ఉండలేని అమ్మ, నరాల బలహీనతకు లోనై, పిచ్చిదయి, చివరి రోజుల్లో దారుణమైన చావు పొందింది! బయట చాలా నిబ్బరంగా ఉన్నట్లు నటించ ప్రయత్నించిన నాన్న—ఆ దిగులుతోనే తీసుకుంటూ నాన్న గూడా పోయారు!

నీది చాలా రాతి గుండె అన్నాయ్! కఠినంగా ప్రవర్తించి మమ్మల్ని దూరం చేసుకొని ఏం బావుకున్నావో ఊహించలేకుండా ఉన్నాను!

ఒక్కసారిగా సాంఘిక కట్టుబాట్లను పెకల్చివ తెంచుకోటానికి ప్రయత్నించినందుకు, కాలం తెచ్చిన పరిణామాలకు ఫలితం వాళ్ళు అనుభవించారు! సాక్షిగా మాత్రం నేను మిగిలాను స్నేహితుల ద్వారా ఇవన్నీ నీవు విని ఉండవచ్చు! బాధ కల్గలేదా అన్నాయ్! అయినప్పటికిని నీవు భరిస్తావ్! అది నాకు తెల్సు! —ఆ మధ్యన ఇదివరకు మన ఇంటి ప్రక్కనే ఉండే రఘురామయ్య కల్సి, నీవు హైద్రాబాదులో ఉంటు న్నట్లు, నిన్ను కలుసుకొని నీతో రెండు రోజులు గడిపినట్లు చెప్పాడు ఈ అడ్రసు ఆయన దగ్గర సాధించిందే!

ఆయన చనిపోయిన తరువాత మా పరిస్థితి చితికిపోయింది జీవితంలో నిజమైన కష్టాలు ప్రారంభమయ్యాయి! మూర్తి బి ఏ పాసయ్యాడు బ్రతుకుబాటను కల్పించుకోవాలని సిటీకి వస్తున్నాడు నీకు తెల్సుగా ఈ రోజుల్లో డిగ్రీ కాగితానికున్న విలువ! మామూలు తెల్ల కాగితమే నయం దానికన్నా, కనీసం ఏదన్నా రాసుకోటానికన్నా పనికొస్తుంది! విజయవాడలో ఉద్యోగం దొరకటం దుర్బరమైంది బ్యాంకులో జీవనోపాధి కేసిన డబ్బు క్రమేపీ తగ్గిపోతున్నది ఇటువంటి స్థితిలో వీణ్ణి నీ దగ్గరకు పంపిస్తున్నాను! మేనమామవు, ఆశ్రయాన్ని కల్పిస్తావన్న ఆశతో! శక్తికి మించినదయితే తలపెట్టకు! మంచి స్థితిలోఉన్న నిన్ను కష్ట పెట్టాలని నా అభిమతంకాదు హైద్రాబాదు మూర్తి వస్తుంటే, కనీసం వాడి ద్వారా నైనా నీ క్షేమం తెలుస్తుందని, ఆశిస్తూ

నీ చెల్లెలు
సుందరమ్మ

—ఇంత పెద్ద ఉత్తరాన్ని చదువుకున్న గౌరీపతిగారు తలెత్తి, అప్పుడు మధురమూర్తిని పరకాయించి చూశారు!

అతని బట్టలు పూర్తిగా మాసిపోయినాయి! మనిషి బక్కపల్చగా ఉన్నాడు! ముక్కు కొటేరు తీర్చినట్లుగాఉంది! చూడటానికి ఆకర్షణీయంగా ఉన్నాడు

టేబుల్‌మీద అమర్చిన అగరు వత్తుల ధూపం పరిమళంతో గది అంతా సువాసనలతో నిండిపోయింది! ఉదయపు కిరణాల లేత కాంతి కిటికీలగుండా గదిలోకి ప్రసరిస్తున్నది

గౌరీపతిగారు ఉత్తరాన్ని మడిచి కవరులో పెట్టి, బల్లమీద ఉంచారు ఆయన కదిలిపోయారు ఒక విధంగా మేనల్లుణ్ణి ఇన్నేళ్ల తర్వాత చూసినందుకు సంతోషపు ఛాయలు మనసులో పొడసూపినప్పటికిని, చెల్లెలు—ఉత్తరం ఆయన నిబ్బరాన్ని నీరు కంటే తేలిగ్గా మార్చివేసింది

కాసేపాగి, "కూర్చో" అన్నారు

—మూర్తి తటపటాయిస్తూ సోఫాలో అంచు చివర్న కూర్చున్నాడు

'మూర్తీ! ఇన్నేళ్ళ తర్వాత నిన్ను చూడగల్గుతానని నేను కలలో గూడా అనుకోలేదు నీ రాక చాలా సంతోషాన్ని కలుగ జేసింది'

ఆయన—మాటలు వింటున్న మూర్తి మనస్సు మేనమామపట్ల గౌరవభావంతో నిండిపోయింది తలవంచుకొని, కాలిక్రింద పరిచిఉన్న మెత్తని తివాసీని చూడటంలో నిమగ్నుడయ్యాడు

"నాన్న పోయినందుకు చాలా విచారంగా ఉంది! చెట్టంత మనిషి! సుందరం—పెండ్లిలో ఎంత కలుపుగోలుగా ఉన్నాడు!' మరిచిపోయిన జీవితపు మొదటి భాగం ఆయన కండ్లముందు మెదిలింది

'సుందరం చిలిపి పిల్ల! పెండ్లిలోనే తమలపాకుల్లో చింతపిక్కలు కట్టి ఇచ్చింది' ఆయన నవ్వకుండా ఉండలేకపోయారు, అది అని

తండ్రి—ఆకారం లీలామాత్రంగా క్షణకాలం మూర్తి కండ్లముందు మెదిలింది!

"నేను సంఘంనుంచి వెలివేయబడ్డవాణ్ణి! నా పద్ధతులూ, ఆశయాలూ ఎవరికీ నచ్చలేదు! చివరకు మా ఇంట్లోనే భరించలేకపోయారు మీ అత్తయ్యను స్వతంత్రంగా ఎవరికీ చెప్పకుండా పెండ్లి చేసుకున్నందుకు ఎంత గొడవ జరిగిందో అమ్మ చెప్పే ఉంటుంది'— ఆయన తేలిగ్గా నవ్వటానికి ప్రయత్నం చేసి విఫలుడయ్యాడు!

మూర్తి సూటిగా మామయ్యవైపు చూశాడు చిన్నప్పటినుంచీ, అతనికి మామయ్య అంటూ ఉన్నాడని తెల్సినప్పటినుంచీ, ఒక విధమైన గౌరవాభిమానాలు ఉన్నవి! ఎన్నడూ చూడనప్పటికినీ, మామయ్య అతని దృష్టిలో ఆదర్శప్రాయుడు!

మాట్లాడకుండా తన వైపే చూస్తున్న మేనల్లుడికి చెప్తున్న సంగతులు రుచించాయని గ్రహించారు గౌరీపతిగారు! తన ఆశయాలూ, ఆదర్శాలూ ఎదుటి వారికి నచ్చినట్లు గ్రహిస్తే, ఆయనకు ఆవేశం పెరుగుతుంది! కండ్లు చిట్లిస్తూ అన్నారు

—'మూర్తీ! ఎవరు ఏమనుకున్నప్పటికిని నేనూ బ్రతికాను! సంతోషంగా జీవితంలో ఎంతైతే

—37 వ పేజీ చూడండి








## జరిగిన కథ

బెలూన్‌లో ప్రయాణ విధానం కనిపెట్టిన ఫాన్ఎగ్‌బర్గ్, ఆయన మిత్రుడు పాల్‌టీర్ షెల్డ్, ఇతని బావమరిది మారిస్ స్పీడర్, పని మనిషి ఫిలిప్పిన్‌లు బెలూన్‌లో ధ్రువయాత్రకు బయల్దేరుతారు గ్రీన్‌లాండ్‌కు తూర్పుగా ఉన్న ద్వీపం చేరాక ఒకరోజుపాటు నీటిమీద ప్రయాణం చేస్తారు వారికి నీటి ఏంపోల ఎదురవుతుంటాయి వాటిని జయించి కొన్ని రోజులకు ధ్రువం చేరుకు తిరుగు ప్రయాణం ప్రారంభిస్తారు దారిలో వారికి ఓ నౌక ఎదురౌతుంది దాని అధికారి ఎడ్వర్డ్ బర్నెట్‌తో పరిచయం సంపాదించుకుంటారు బర్నెట్ సేవకుడొకడు రహస్యంగా బెలూన్ యాత్రికులదగ్గరికి వచ్చి, బర్నెట్ మూరా బెలూన్‌మీద దాడి చేయదల్చుకున్న విషయం చెప్పగా మన యాత్రికులు ఎదురుదాడి జరిపి, నౌకలోని బందీగాఉన్న నార్త్ బరో ప్రభువును విడిపిస్తారు

## 7

లార్డ్ నార్త్‌బరో వారి ప్రార్థనను త్రోసిపుచ్చ లేకపోయాడు. దీనికి రెండు కారణాలున్నాయి, మొదటిది, వారు నావ కాప్టెన్ అయిన బర్లెట్ చెప్పినట్లు నడుచుకున్నారేకాని నావ అధిపతిమీద ద్వేషంఉండి కాదు, రెండవది, నావ నడిపేందుకు మనుష్యులు కావాలి-వీరుతప్ప మరెవరు దొరుకుతారు?

ఆ గదిలో మరొక నావికుడు నిద్రపోతున్నసంగతి ఇంతకు ముందే చెప్పటం జరిగింది అతన్నికూడా లేపారు ఆ నావికుడు లార్డ్ నార్త్ బరోతప్ప తనకివేరే అధిపతి ఉండడని శపథంచేశాడు

అందరివద్దా ఇక మళ్లీ తిరుగుబాటులు ఉండవని ఒట్టు పెట్టించుకున్నారు. ఫాన్ఎగ్‌బర్గ్, పాల్‌లు ఇద్దరూ బర్లెట్‌ను నావమీదకి తీసుకురావటానికని పడవలో ద్వీపానికి వెళ్లారు పడవదాకా సాగనంపేందుకు వచ్చిన లార్డ్ నార్త్ బరో, తనూ మర్నాడు వచ్చి

వారిని కలుసుకుంటానని చెప్పాడు.

భూమి తగలగానే 'షేక్స్పియర్' నావికులు తమకు పూర్తి క్షమాపణ దొరుకవచ్చుననేమో, బర్లెట్ విషయంలో పాల్, ఫాన్ ఎగ్బర్గ్‌లు చెప్పినట్లే నడుచుకున్నారు. వీరి రాకకోసం ఆదుర్దాగా ఎదురు చూస్తున్న మారిస్ సంతోషానికి అంతులేదు.

అలిసిపోయిఉన్న బెలూన్ ప్రయాణికులు కొన్నిగంటలు నిద్ర పోయారు. తిరిగి నిద్ర లేచేసరికి అంతకుముందు జరిగినదంతా ఒక పీడకల కాదు కదా అనిపించింది. కాని అక్కడేఉన్న శవాలు ఈ ఊహను పోగొట్టేశాయి.

తెల్లవారిన తర్వాత లార్డ్ నార్త్ బరో, సర్ జేమ్స్‌లు చెప్పినట్లుగానే ద్వీపంమీదికి వచ్చారు. నావ మీద ఏవిధమయిన అలజడీ లేదనీ, నావికులు పూర్తిగా విధేయులయి పోయారనీ లార్డుగారు చెప్పారు. మరణించిన వారిని పాతివేసి, బెలూన్ చూడటానికి వెళ్ళారు.

బర్లెట్‌లాగ కాకుండా వారిద్దరూ నిర్మాణంలోని నైపుణ్యాన్ని గ్రహించి, అభినందించారు. ఉత్తర ధ్రువం గురించి ఫాన్ ఎగ్‌బర్గ్ చెప్పిన విషయాలను ఉత్సాహంతో విన్నారు, తమ పరిస్థితి అంతకు ముందే ఎంత ప్రమాదంగా ఉందో మర్చిపోయి.

బెలూన్ ప్రయాణికులందరినీ నావమీద తన ఆతిథ్యం స్వీకరించమని కోరాడు లార్డ్ నార్త్‌బరో. అదే రోజు నావ తిరిగి ప్రయాణం కొనసాగించవలసివస్తుందన్నాడు. కలకత్తాలో అత్యవసరంగా చూసుకోవలసిన పనులు కొన్ని ఉన్నాయన్నాడు. మన ప్రయాణికులు సంతోషంగా అతని ఆహ్వానాన్ని స్వీకరించారు. వాతావరణం చక్కగా ఉండటంవల్ల భోజనం 'డెక్' మీదనే వడ్డించారు. నావికులు అన్నిపనులూ అతి వినయంగా, చురుకుగా చెయ్యడం గమనించారు బెలూన్ ప్రయాణికులు. తమ తప్పిదానికి పశ్చాత్తాప పడి మరికొంత చురుకుగా ఉన్నారా అనిపించింది! నావికులు బర్లెట్‌తో బాటు కలిసి చేసిన నేరం ఒప్పుకుంటూ ఒక కాగితంమీద సంతకం పెట్టారుకూడా.

"అయ్యా, మీరు నాకు చేసిన మేలు ఎన్నటికీ మరువలేను. బెలూన్‌లో హాలండ్‌కు తిరిగి వెళ్ళడం కష్టం అనిపించినట్లయితే నా ఇతర ఏర్పాట్లు వదులుకుని మీతోనే సముద్రం మీదుగా

కథకుడు: ఒకే! ఈమధ్య ఆడపిల్లల పేరెట్టుకుని ఆరు కథలు రాశాను.

స్నేహితుడు: ఎంతమంది మగాళ్లు ప్రేమలేఖలు రాశారూ?

రాజారాం (కొవ్వూరు)

వస్తాను" అన్నాడు లార్డ్ నార్త్‌బరో.

"చాలా కృతజ్ఞులం!" అన్నాడు ఫాన్ ఎగ్‌బర్గ్ సౌమ్యంగా. "మీరు నిజంగా చాలా సదుద్దేశంతో ఇలా అంటున్నారు. కాని 'హూయిటర్' మా కా కష్టం లేకుండా ఎక్కడికి కావలిస్తే అక్కడికి తీసుకుపోతుంది. కొంచెం వాలు గాలి వస్తేచాలు."

"పోనీలెండి, అల్లాగయితే, మీరు సుఖంగా ప్రయాణం చెయ్యాలని కోరుకోనీయండి! మీ వద్ద శాశ్వతంగా సెలవు తీసుకోను! మనం మళ్లీ కలుస్తామనే నమ్మకం నాకుంది. వచ్చే సంవత్సరం వసంత ఋతువుకి ఇంగ్లాండు వస్తాను. అప్పుడు యూరోప్ వచ్చి మిమ్మల్ని చూస్తాలెండి!"

అందరూ భోజనం బల్ల వదిలి లేవపోతూ ఉండగా అతను ఒక చిన్నపెట్టె బయటపెట్టాడు. ఎలాగో ఇది తిరుగుబాటు వర్గం వారి కంట పడకుండా దాచి ఉంచాడుట.

"అయ్యా, మీరు చేసిన మేలుకి జ్ఞాపకార్థంగా-ఈఇంగ్లీషువాడిచేత్తో మీకందరకీ ఇచ్చే ఈ చిన్న కానుకలు పుచ్చుకోమని కోరుతున్నాను" అన్నాడు.

పెట్టె తెరిచి లార్డ్ నార్త్ బరో ఫ్రెడరిక్‌కి ఒక వజ్రహారమూ, పాల్‌కి రవ్వలు పొదిగిన ఒక ఉంగరం, పిన్నూ, మారిస్‌కి ఒక చక్కని గడియారమూ, ఫిలిప్పిన్‌కి ఒక గడియారమూ ఇవ్వపోయాడు.

ఫాన్ ఎగ్‌బర్గ్ వద్దన్నాడు, అందరి తరఫునా ఈ కానుకలు నిరాకరించాడు. కాని లార్డ్‌గారు మరీ మరీ బలవంతం చెయ్యడంతో, స్వీకరించకపోతే తనకు బాధగా ఉంటుందనడంతో సరేనన్నాడు. పడవలో ద్వీపానికి వెళ్లినప్పుడు నార్త్‌బరో తనుకూడా వచ్చితీరంమీద దిగబెట్టి, తిరిగి తన గాఢ కృతజ్ఞతను తెలుపుకుని మరీ సెలవు తీసుకున్నాడు. గంటలో నావ ఆగ్నేయం దిక్కుగా మాయమయి పోయింది.

ఫిలిప్పిన్ గాయం త్వర త్వరగానే నయం అయిపోతోంది. దీనికితోడు గడియారం ఒకటి లభించిందేమో చాలా సంతోషంగా ఉన్నాడు. క్షణక్షణానికీ దాన్ని చూసి, ఊరికే ఆడించి ఆనందించేవాడు.

"ఆహా నిజంగా మంచి రకం గడియారం!" అన్నాడు. "ఈ గల్లంతులో దెబ్బ తగిల్తే తగిలింది కాని మంచి బహుమతికూడా లభించింది! ఇది నిజంగా నా సొంతం! ..లార్డ్

42—వ పేజీ చూడండి

## గ్రహస్థితి

వృషభంలో సూర్య బుధ శుక్రులు మిధునంలో రాహువు, సింహంలో అంగారకుడు, ధనుస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, వృశ్చిక ధనుర్మకర కుంభాలలో చంద్రుడు




దైవజ్ఞ పోతూరి శ్రీరామమూర్తి

**7-6-1968 శుక్రవారము మొదలు**
**13-6-1963 గురువారము వరకు**

### ఈ వారము ధరలు

మిర్చి ధరలో క్రమంగా గిరాకి సూచన కనుపిస్తుంది మినుములు, పెసలు-వీటి ధరలు నిలకడగా ఉండి వారాంతంలో మంది వస్తుంది నూవుల ధర నిలకడగా ఉంటుంది నూవులనూనె ధర కొద్దిగా తగ్గుతుంది వేరుశనగ పప్పు ధరలో పెరుగుదల కనుపిస్తుంది నూలు ధర వారం రెండవ భాగంలో పెరుగుతుంది

### మేషం:

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా)**

గతవారంకన్నా, మీ శక్తి సామర్థ్యాలు పెరిగే అవకాశాలున్నవి వృత్తి ఉద్యోగాలలో మీ నేర్పు వల్ల పదిమందికీ సంతృప్తి కలిగించగలుగుతారు ఇంతకుముందే జరిగిపోయినవని భావిస్తున్న కార్యక్రమాలు తిరిగి ప్రారంభం అయినట్లు కనుపిస్తవి పిల్లల అసౌఖ్య అనారోగ్య సమస్యలు మిమ్ములను చికాకు పరచగలవు మీ మాట పొందికవల్ల ఇతరుల వ్యవహారాలను సర్దుబాటు చేయగలుగుతారు ప్రయాణాలవల్ల శ్రమ కలుగుతుంది కాని, కార్యసిద్ధియొక్క సంతృప్తి బాగుంటుంది మామూలు కన్నా, ఖర్చులు పెరుగుతవి మిమ్ములను చులకనగా చూచేవారు తటస్థపడగలరు అయితే మీ బుద్ధి బలంతో గౌరవమును కాపాడుకొనగలుగుతారు ముఖ్యంగా లోగడ ఇతరులకు చెప్పిన మాటను నెరవేర్చుకొనుటకు ప్రయత్నించటం అవసరం 7, 8 తేదులలో సంతోష, సుఖాలకు ఆటంకం, బంధు విరోధం

* * *

### వృషభం:

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా)**

ఈ సమయంలో చిన్నచిన్న సమస్యలు ఎదురు పడుతున్నా, పేరు ప్రతిష్ఠలు, ధనాదయము బాగుంటవి వ్యవహార రంగంలో తగినంత ప్రయోజనం కనిపిస్తుంది అధికారులతో నేర్పుతో మాట్లాడవలసిన సమయం బంధు మిత్రులతో విరోధ సూచనలు కనుపిస్తూ, సమసిపోతూ ఉంటవి శుభ సంతోష ప్రసంగాలలో పాల్గొంటారు ఇతరులతో కలసి చేయు పనులు చికాకులకు, సందేహాలకు కారణం అవుతవి విద్యార్థులకు ప్రోత్సాహకరంగా ఉంటుంది వ్యాపార వృత్తులలో కార్యభారం పెరుగుతుంది రచ్చకు ఎక్కవలసి వస్తదని అనుకున్న వ్యవహారాలు ప్రశాంతంగా పరిష్కారం అవుతవి నౌకరులతో కలహాలు వస్తవి, వారాంతంలో దుబారా ఖర్చులెక్కువ 8, 9 తేదులలో ఆందోళన, వృత్తిలో పోటీ, స్వల్ప ఫలితం

* * *

### మిధునం:

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా)**

ప్రస్తుతం మానసిక ఉద్రేకాన్ని తగ్గించుకొని తటస్థంగా ఉండవలసిన సమయం. ఇతరుల వ్యవహారాలలో మితంగా ఉండటంవల్ల చిక్కు పడకుండా, మీ గౌరవాన్ని నిలుపుకొనగలుగుతారు తరచు బలహీనత తోస్తూ ఉండటంవల్ల ఏ పనీ చురుకుగా సాగదు చేయిదాటిపోయిన వస్తువులను గురించి శ్రమపడతారు స్నేహితులు మీకు ఆశ చూపుస్తూ వెనుకకు వెళ్లటానికి, ముందుకు వెళ్లటానికి అవకాశం లేకుండా చేస్తారు ఈ సమయంలో ముందు జాగ్రత్త అవసరం ఆదాయం మామూలుగా ఉంటుంది మీరు ఎదటివారిని మెప్పించటానికి ప్రయత్నించి సాఫల్యం పొందగలుగుతారు శుభకార్యప్రయత్నాలు అనుకూలిస్తవి మీ ఆరోగ్యం గురించి శ్రద్ధ అవసరం 9, 10 తేదులలో సుఖభంగం, ఉపయోగం లేని ఆలోచనలు

* * *

### కర్కాటకం:

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

వృత్తిలో ధనాదాయంతోపాటు గౌరవం కూడా వృద్ధి అవుతుంది దూర ప్రయాణాలు చేస్తారు స్వంత వ్యవహారాలను నిర్వహించుకొంటూ సంఘ కార్యాలలో కూడా గౌరవంగా పాల్గొంటూ ఉంటారు ఇతరులకు వాక్సహాయం, ధనసహాయం కూడా చేయగలుగుతారు వారం ఆరంభంలో అకస్మాత్తుగా శిరోభాగంలో బాధ కనుపిస్తుంది సంతృప్తికరంగా ధనం సంపాదించి, అదే పద్ధతిలో ఖర్చుచేయటం జరుగుతుంది బాహ్య ఆడంబరం పెరుగుతుంది ఇంతకుముందు అంతరంగికుల మాదిరి ఉంటున్నవారే ఒక సందర్భంలో మీ మాటను వ్యతిరేకార్థంగా భావిస్తారు వినోద, సుఖాల నిమిత్తం అధికంగా ధనం వినియోగించ గలుగుతారు వ్యవహారాలలో మీ అభిప్రాయాలను నిస్సంకోచంగా బయటపెట్టగల అవకాశం లభిస్తుంది 10, 11 తేదులలో కార్యభారం ఎక్కువ శుభవార్తలు, బంధు దర్శనం

* * *

### సింహం:

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

జాగ్రత్తగా ఉన్నామనుకొంటూ, అకస్మాత్తుగా పొరపాట్లు చేస్తారు సహాయం చేసే మనుష్యులు మీకన్నా ఒక అడుగు వెనకనే ఉంటారు తరఫు ఉత్తమ స్థితియందున్న వారితో పరిచయం రాజకీయాలు మొదలయినవానిలో పాల్గొనుట జరుగుతుంది ప్రస్తుతం ధనవ్యయం అవుతుందే కాని, పని జరగలేదనే బాధ ఉండదు వ్యాపార వృత్తులయందు ధనం పెట్టుబడి పెట్టటం మొదలయిన ప్రయత్నాలు సులభంగా అనుకూలిస్తవి క్రొత్త వారి పరిచయంవల్ల ఉత్సాహము, గౌరవము, వృత్తిలో చెప్పుకోదగిన మంచి మార్పు కనుపిస్తుంది ఈ సమయంలో ఎవ్వరితోను పట్టుదలలు, ప్రతిజ్ఞలు అంత మంచిదికాదు అనుభవంలేని పనులలో ధన నష్టం, శారీరకంగా శ్రమ భరించవలసివస్తుంది 11, 12 తేదులలో అనారోగ్యం, విరోధులవల్ల అపకార సూచనలు

* * *

### కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా)**

మంచి మార్పు రా దగిన సమయం పది మందిలో పలుకుబడి సంపాదిస్తారు మీరు ముందు చేసిన ప్రయత్నాలు ఇతరుల నిమిత్తం వినియోగించ గలుగుతారు కుటుంబంలో అసంతృప్తి లక్షణాలు సమసిపోతవి ధనంకన్నా, గౌరవం ప్రధానంగా చూచుకొనటంవల్ల నిష్ఠురాలకు గురి— కావలసి వస్తుంది మీ నేర్పు, బుద్ధిబలంవల్ల మీ చుట్టుపక్కల వారిని సంతృప్తిపరచ గలుగుతారు దేహంలో బలహీనత, రక్తలోపము, దోషమువల్ల బాధలు కనుపిస్తవి. అంగారక స్తోత్ర పారాయణం చేసుకొనటం మంచిది వ్యవహార జయం, సంఘంలో గౌరవం లభిస్తవి వాహనాలు ఎక్కటం, యంత్ర కార్యాలు మొదలయిన సందర్భాలలో జాగ్రత్తగా ఉండండి 12, 13 తేదులలో తరచు సందేహాలు, పిల్లలకు అనారోగ్యం

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మీరు ఎంత జాగ్రత్తగా మసలుకొన్నా, తప్పులు వెతికేవారుంటారు కుటుంబంలోనివారి అనారోగ్యాలు మిమ్మలను చికాకు పరుస్తవి ప్రస్తుతం శ్రమకు తగినంత ఫలితం లేదనే భావం పెట్టుకోవద్దు సుఖ సంతోష వార్తలు తెలుస్తవి ముందు ముందు మీ ధన గౌరవాలు బాగా వృద్ధి కాదగిన అవకాశాలు కలవవస్తవి ప్రస్తుతం ఎంత జాగ్రత్త వహించి రహస్యం కాపాడుకొంటే అంత మంచిది దుర్వార్తలు తెలియగల సమయం బంధుమిత్రుల మూలంగా మీ పనులు చక్కగా నెరవేరుతవి జీర్ణకోశాలలో బాధ కనుపిస్తుంది ఖర్చుల విషయంలో కట్టుబాటు అవసరం ఇంతకుముందు ఒప్పుకున్న ప్రకారం పనులు పూర్తిచేయటం అసాధ్యంగా తోస్తుంది సూర్య నమస్కారాలు, స్తోత్రపారాయణం చేసుకొనటంవల్ల మీ ఆరోగ్యం బాగుపడుతుంది 12, 13 తేదులలో సంఘంలో గౌరవం, బంధుమిత్రుల రాక, ఇష్టవస్తు ప్రాప్తి

* * *

## వృశ్చికం

**(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష)**

ప్రతి విషయంలో ముందు జాగ్రత్తతో ఉండగలుగుతారు తరచు మీ సహాయం కోరేవారు ఉంటారు కుటుంబ విషయాలలో చాలా మృదువుగా ఉండవలసిన సమయం ఒకదాని కొకటి సంబంధం లేకుండా కార్యక్రమాలయొక్క భారం పెరుగుతూ వస్తుంది గర్భకోశాలలోను, అవయవముల సంధులయందు బాధ కనుపించి ఉపశమనం కలుగుతుంది తీవ్రంగా ఆలోచించి కూడా ఒక నిర్ణయానికి రాలేకపోతారు కోర్టు కచేరీలలో అనుకూలత ఉంటుంది దైవకార్యాలలో పాల్గొంటారు వారం చివరి భాగంలో ప్రయాణాలు చేస్తారు సంఘంలో గౌరవం లభిస్తుంది 11, 12 తేదులలో సాహసకార్యాలు, చిన్నచిన్న పేచీలు, దుబారా ఖర్చు

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

వృత్తిలో ప్రతిబంధకాలు అధికం వృధా కలహాలు వస్తవి అంతే డబ్బు–ఇబ్బంది మాత్రం ఉండదు ఎదురుచూస్తున్న వార్తలు సకాలంలో అందుతవి మీరు సంకోచిస్తూ ఆరంభించిన పనులు కూడా గౌరవప్రదంగా జరుగుతవి పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది ఈ సమయంలో ఎవ్వరినీ నమ్మి, మీ బాధ్యతలను వదిలిపెట్టటం మంచిదికాదు విద్యా–విషయమైన చర్చలు, ప్రసంగాలు మొదలయిన విషయాలలో ప్రోత్సాహం లభిస్తుంది ప్రశాంతంగా ఉండటానికి వీలుకాదు ముందుగా నిర్ణయించుకొన్న కార్యక్రమాలు మార్పు చేసుకొంటూ, ముందుకు పోవలసిన సమయం ఆత్మీయులవద్దనుంచి కష్టవార్తలు తెలుస్తవి 10, 11 తేదులలో ధనలాభం, మంచివారి స్నేహం లభిస్తుంది

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

కుటుంబ సంబంధమైన చికాకులు తగ్గుతవి మీ ఆలోచనలు కార్యరూపం పొందుతవి ఆదాయం కూడా ముందుకన్నా మేలుగా ఉంటుంది మీ ధైర్యాన్ని పరీక్షించేవారుంటారు ధనలోపం మాత్రం తప్పకపోవచ్చు పడమర దిక్కునుంచి ఉత్సాహకరమైన వార్తలు వింటారు వృత్తిలో అధికారుల వత్తిడి అధికం కాగల అవకాశాలున్నవి మీ ప్రసంగాలలో గాని, వ్రాతలలో గాని బలహీనత బయటపడకుండా కాపాడుకొన గలుగుతారు ఒకే సమయంలో రకరకాల ఆలోచనలు చుట్టుముట్టుకొనటంవల్ల ఆందోళనపడి ఒక విధంగా నిశ్చయానికి రాగలుగుతారు ప్రయాణాలు నిలిచిపోయే అవకాశాలున్నవి 9, 10 తేదులలో ఇతరులకు సహాయం చేయటం, సంబంధంలేని పనులలో వృధాశ్రమ, ధనలోపం

* * *

## కుంభం

**(ధనిష 3, 4 పా, శతభిషం, పూ భాద్ర 1, 2, 3 పా)**

ప్రస్తుతం మీ స్థితికి ఏ విధంగాను భంగం ఉండదు తరచు కలహాలు వస్తవనే భయం మాత్రం మిమ్మలను వెంబడిస్తూ ఉంటుంది శ్రమపడినా, పై అధికారులను మెప్పించటం అసాధ్యమే కావచ్చు సంఘంలో పేరు, పలుకుబడి బాగుంటవి సాధ్యమైనంతవరకు ఇతరుల విషయాలలో కలుగజేసుకొనకుండా ఉండటం అవసరం బంధువర్గంలో ఆదరాభిమానాలు లభిస్తవి ప్రస్తుతం మీ ఆర్థిక స్థితి విశేషంగా పెరగదు కాని, గౌరవం చెడకుండా పదిమందిలో మీ హంగులను కాపాడుకొంటారు దైవకార్యాలు నెరవేరుతవి ఒక సమయంలో శక్తికి మించిన ప్రయత్నాలు ఆరంభించి చిక్కుపడవలసి వస్తుంది 8, 9 తేదులలో ప్రయాణం, స్వల్ప ఫలితం ఎదురుచూడని శ్రమ

* * *

## మీనం.

**(పూ భాద్ర 4 పా, ఉ భాద్ర, రేవతి)**

మీ మాటకు ఎదురు అనేది ఉండదు సుఖము సంతోషము లభిస్తవి ఒక సమయంలో కీడు చేస్తవనుకున్న వ్యవహారాలు కూడా గౌరవప్రదంగా పరిష్కారం అవుతవి ఇతరుల మాటను కాదనలేని స్థితిలో కార్యభారం పెరుగుతుంది శుభ వార్తలు తెలుస్తవి కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుండదు ప్రస్తుతం మీ ఆదాయాన్ని, అవసరాలను మనస్సులో పెట్టుకుని తగు విధంగా పనులు సాగించటం అవసరం ఎవరో సహాయం చేస్తారని నిర్లక్ష్యంగా ఉండవద్దు ఆడంబరాన్ని, అవసరాలను ఎంత తగ్గించుకొంటే, అంత సుఖంగా ఉండగలుగుతారు ఎంత చురుకుగా జరుపుకొన్నా స్వల్ప విషయాలలో మనస్సుకు కొరత అవేది తోస్తూ ఉంటుంది 7, 8 తేదులలో సంతోష వార్తలు తలవనితలంపుగా ధనలాభం, వృత్తిలో శ్రమ ★



'...పోదాం రారా !–ఈ గీతలన్నీ మనమే గీశామంటారేమో !..

# పొదుపుకోసం అమృతాంజన్ అట్టపెట్టెల్లో వస్తోంది

నేడు మన దేశపు ఆదాయము రక్షణ కొరకు అవసరము. సాధారణంగా పరిచితమైన అమృతాంజన్ డబ్బా తయారుచేయడానికి కావలసిన టిన్‌రేకు నేడు జాతీయ అత్యవసరాలకు కేటాయింపబడినది. కాబట్టి దీనికిబదులు మేము క్రొత్త రకం పొదుపైన అట్టపెట్టె వాడుతున్నాము. ఇంతేగాకుండా సీసాలో నమ్మకమైన అమృతాంజన్ అందజేయడానికి మోసంచేయడానికి వీలులేకుండా 'అలు'కాప్ ('Alu'-cap) తో సీసా సీలు చేయబడింది ■ పూర్వం ఎప్పటికంటే కూడా ఇప్పుడు మీకు అమృతాంజన్ ఎక్కువ అవసరము కండల నొప్పులు, బెణుకులు, గుండె జలుబులు, కీళ్ళ నొప్పులు, ఆరోగ్యం చెరచి నీరసపరచి అధికంగా కావలసిన ఉత్పత్తులను తగ్గించే రోగాలు నిర్మూలించడానికి సహకరిస్తుంది.

*అమోఘమైనది, మిత వ్యయంతో కూడినది, అనేక విధాల ఉపయోగపడేది.*

అమృతాంజన్ అమోఘంగా పనిచేసే నొప్పుల నివారణిని మీరు కొనవచ్చు. ఇటువంటి మందులన్నిటికంటె దీనిలో గుణావహకమైన ఔషధాలు అధిక పరిమాణాల్లో ఉంటాయి. ■ దీనిలో ఏకమైయున్న మందులు బాధలను నివర్తించి వెంటనే ఉపశమనం కలిగించడానికి శరీర చర్మంలో అతి శీఘ్రంగాను లోతుగాను ప్రవేశిస్తాయి. ప్రతిసారి మీకు ఏ నాలుగు వర్లగింజల ఎత్తో అమృతాంజన్ కావలసి ఉంటుంది. ఇంట్లో ఇంటిల్లిపాదీ ఉపయోగించినా ఒక బుడ్డి నెలల తరబడి ఉపయోగానికి వస్తుంది.




AMRUTANJAN
THE PAIN BALM
AMRUTANJAN LTD.

# అమృతాంజనము

## ఆరోగ్యం ఇస్తుంది

అమృతాంజన్ లిమిటెడ్ 14/15 ఎత్ చర్చి రోడ్, మద్రాసు-4



గుండె జలుబు



కీళ్ళ నొప్పులు



తల నొప్పులు

JWT-AM-2225a




అయిదు గంటలకు పదిహేను నిముషములు తక్కువఉన్నది బస్సు టైము ఐనదని కొంచెం వేగంగా నడక సాగించాను బస్సుస్టేజ్ ను అయిదు గంటలకు చేరుకున్నాను అక్కడ వి. ఎల్. డబ్ల్యు. వెంకటస్వామి, పట్వారి పాలిమియ్యా, ఇంకా ఎవరెవరో ఏవో మాటలు మాట్లాడుకుంటూ నిల్చున్నారు వారి దగ్గరికి వెళ్ళాను. నన్ను, వారు మాటల్లో గు రించ లేదు

ఒక తొమ్మిదేండ్లున్న అబ్బయిని వారు ఏవేవో ప్రశ్నలు అడుగుతున్నారు. ఆ అబ్బాయి ఏడుస్తున్నాడు. బిక్క మొహం తో జవాబులు అలాగే చెబుతున్నాడు.

వెంకటస్వామి:- "నీకు బాగా గుర్తుందా? నీ ప్రక్కన ఎవరు కూర్చుండినది బాగా చూశావా లేదా?"

ఆ అబ్బాయి:- "బాగా చూశాను. ముసిలాయన కూర్చుని ఉండె ఆయన ఐజకు టికెట్టు తీసుకొనె."

పాలిమియా:- "ఐ తే ఆ ముసిలాయనకూడా నీ పెక్కన స్టేజినుండే ఎక్కాడా?"

ఆ అబ్బాయి:- "అవును. అతడిది పైపాడట."

వెంకటస్వామి :- "ఓ! అలాగా; ఐ ఫె అతడే తీసుంటాడు."

ఇక నా మనసు ఊరకుండలేక పోయింది. విషయ మేమిటో అడగాలనిపించింది. వారి మాటలనుబట్టి ఆ అబ్బాయి ఏదో విలువైన వస్తువును పోగొట్టుకున్నాడని తెలుస్తూనే ఉంది.

"విషయమేమిటి వెంకటస్వామీ?" అని అడిగా.

"ఓహో! మీరా! ఎప్పుడు వచ్చారు? ఇదిగో ఈ అబ్బాయిది

—35 వ పేజీ చూడండి

ఆమె రూపవతి... ఆమె పాండ్స్‌ను వాడుతుంది

మృదువైన, యవ్వనవంతమైన ముఖ చర్మమునకు

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి—

## అది జిగురుగా లేకుండా దివ్యముగా ఉంటుంది!




పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మీ ముఖమును మృదువుగా మరియు మనోహరముగా చేస్తుంది ముఖముమీద ఉన్న నల్లని కాయలను మరియు చిన్న చిన్న కళంకములను పోగొట్టుకొనుటకు సహాయపడుతుంది పౌడరును అద్దుకొనే ముందు రాసుకొనుటకు అది దివ్యముగా ఉంటుంది! నలుగురిలోనూ ఆకర్షణీయముగా కనపడుటకు పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ ఫేస్ పౌడరును వాడండి అది మీ చర్మపు రంగులో కలిసిపోతుంది, ఏకరీతిగా అంటుకొంటుంది మరియు చిన్న చిన్న లోపములను కప్పుతుంది.

### పాండ్స్ కోల్డ్ క్రీమ్



ప్రతి రాత్రి, పాండ్స్ కోల్డ్ క్రీమును ముఖముమీద మెడ చుట్టూ రాయండి రెండు నిముషముల తరువాత ఎక్కువగా అంటుకొన్న క్రీమును తుడిచివేయండి అది చెమటతో తొలగిపోని, ముఖముమీది దుమ్మును మరియు పాత పౌడరు మొదలగు వాటిని తొలగిస్తుంది!

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు ఎస్ ఎ లో స్థాపించబడినది)

# మంచిపనిచేసిన హంతకుడు

## (జోహాన్సుబర్గ్ - దక్షిణాఫ్రికా)

"మా అబ్బాయికేదో 'ఘోరం' జరిగి ఉంటుందని నా కనుమానంగా ఉంది" అంటూ ఆమె కన్నీరు టపటప రాల్చింది.

బ్లూమ్‌ఫాన్‌టీన్‌లో నేనా రోజుల్లో 'అపరాధ పరిశోధన' శాఖకి చీఫ్‌గా ఉండేవాణ్ణి.

"మూడ్రోజుల క్రితం— మా తమ్ముడూ, మా అబ్బాయీ కలిసి, వూరికి చాలా దూరంలో దాచిన 'గుప్తధనం' త్రవ్వి, పట్టాడానికి వెళ్ళారు. మళ్ళీ జాడలేదు. నా కెంత గాభరాగా ఉందో మీరు వూహించండి" అందామె కన్నీరు తుడుచుకుంటూ.

ఆమె నాకు పంపిన 'విజిటింగ్ కార్డు' చూశాను. ఆమె—పేరు లూసియా మోలర్ అనీ, వితంతనీ, ఇరవై ఎనిమిదేళ్ళ కొడుకు— జాన్ ఫ్రెడరిక్ మోలర్— కనబడటం లేదనీ అందులో ఉంది.

"ఎందుకంత ఖంగారుపడతారు ? మీ వాడితో ఉన్నది మీ తమ్ముడే గాని, పరాయి వాళ్ళెవరూ కాదుగా !— బహుశా ఆ గుప్తధనం వాళ్ళూహించిన కన్నా ఎక్కువ గుప్తంగా ఉందేమో ! అందుకే ఆలస్యం అయ్యుండచ్చు" అన్నాను నేను.

ఆమెకు నా మాటలు సంతృప్తి నివ్వలేదు తల అడ్డంగా వూపుతూ, "నా ఆందోళన మీకు అర్థంకాదు. మా తమ్ముడు విరివిగా నేరాలు చేసి చెడ్డపేరు గణించుకున్నాడు పోయినసారి పోలీసులతన్ని పట్టుకున్నపుడు మా వాడు తనకి నమ్మక ద్రోహం చేశాడని మండిపడ్డాడు. ఆ మాట నిజం కాదనుకోండి— కాని, తను జైల్లోంచి వచ్చాక మావాడి 'పని' పడ్తానని శపథం కూడా చేశాడు" అంది.

ఆనక, ఆమె వెళ్ళిపోయాక, 'అతని ఫైలు' తీశాను. అతని పేరు— స్టీఫెనస్ లూయీవాన్‌విక్. అతనికి సుమారు నలభై అయిదేళ్ళుంటాయి. యౌవ్వనంలో, "ఆరెంజ్ ఫ్రీస్టేట్"లో ఒక పొలంలో పని చేసి, కొన్నాళ్ళ క్రితం అది వదిలేసి, తన 'తెలివితేటలే' జీవనాధారం చేసుకుని వూరూరా పర్యటించడం ప్రారంభించాడు. ఆరంభంలో చిన్నచిన్న దొంగతనాలు చేసి, మా శాఖకి పరిచితుడయ్యాడు ఇటీవల జరిగిన దొంగతనంలో అందినంత డబ్బు పుచ్చుకు పరారీ అయ్యి, పట్టుబడి, ఓ పద్దెనిమిది నెలలు శిక్ష ననుభవించి విడుదలయ్యాడు. పట్టుపడ్డప్పుడల్లా చక్కని కథలు కల్పించి— నమ్మకం గలిగే అంత నేర్పుగా చెప్పి— తన చమత్కారంవల్ల— తనమీదేం తప్పు లేదని తప్పుకో జూసేవాడు. మా శాఖ ఇతని 'వ్యవహారం' మీద 'అనుమానం' కలిగి— అతని వివరాలు, విషయాలు సేకరించమని ఒకతన్ని నియోగించింది. చివరి కతను వాన్‌విక్ పిచ్చివాడని తేల్చాడు. ఆనక, అతని పిచ్చి అదొక రకం పిచ్చనీ, అతి తెలివి పెడదారిన పడ్డం దానికి కారణమై ఉండచ్చనీ తేలింది.

వాన్‌విక్ అనతికాలంలోనే 'భయంకర నేరాలు' చేసే అవకాశం ఉందని, అతని కేసులన్నీ వంటపట్టించుకుని, ఆ ఫైలు తయారు చేసిన తను అభిప్రాయపడ్డాడు. చిన్నతనంలో 'వాన్‌విక్' పిల్లుల తోకకీ, తోకకీ ముడేసి, బెల్టుతో, కొట్టి— అవి పడే 'మరణబాధ' చూసి 'బ్రహ్మానంద'పడేవాడు. జీవహింసలో తను ఆనందం పొందుతాడని— 'ఆయన' అభిప్రాయపడ్డాడు.

మిగతా విషయాలు చదవగా, 'వాన్‌విక్' అతి నైపుణ్యంతో అబద్ధాలు చెప్పడంలో అఖండుడనీ, ఇట్టే కబుర్లల్లోకి దింపి, హుషారుచేసి, అట్టే ఆవతలివాడి డబ్బు కాజేసి, తక్కున పరారీ అయ్యే నేర్పు కలవాడనీ తెలిసింది

ఆ తరువాత — బ్లూమ్‌ఫాన్‌టీన్ సుప్రీమ్ కోర్టువల్ల మరికొన్ని విషయాలు తెలిశాయి.

ఆ కోర్టులో—లూసియా— మోలర్ కొడుకు గుమాస్తా పని చేస్తున్నాడు.

ఆరెంజ్ ఫ్రీస్టేట్ మొత్తానికి — బ్లూమ్‌ఫాన్‌టీన్ రాజధాని వజ్రపు గనులకు ప్రసిద్ధి చెందిన కింబెర్లీనుంచి వంద మైళ్ళ దూరంలో ఉంది బ్లూమ్‌ఫాన్‌టీన్ సుమారు ముప్ఫై వేల వైట్స్ (Whites) గల పట్టణము బోర్స్ రిపబ్లిక్ ప్రభుత్వం ట్రాన్స్‌వాల్‌తో చేరి— బ్రిటన్‌మీద యుద్ధానికి దిగిన నాటినుంచీ ఏ కష్టమూ లేకుండా ఉంది. ఈ నాటికీ నీతి కట్టుబాట్లతో ఉండి— అవినీతి, అట్టే నేరాలూ లేని వూరయింది.

వాన్‌విక్ కొన్ని రోజుల క్రితం వచ్చి, తన మేనల్లుణ్ణి కేకేసినట్టూ, ఆ యిద్దరూ రహస్యంగా ఏకాంతంగా ఏవేవో మాట్లాడుకున్నట్టూ, సుప్రీం కోర్టులో వాకబు చేయగా తెలిసింది. ఆ మాటలు అయ్యాక వాన్‌విక్ వెళ్ళిపోయాడనీ, మోలర్ తిరిగి తన స్థానంలోకి వచ్చి కూర్చుని— బ్లూమ్‌ఫాన్‌టీన్‌కి 150 మైళ్ళ దూరంలో ఉన్న వాటర్‌వాల్ అనేచోట గుప్తధనం తవ్వి తియ్యడానికి, తన మావయ్యతో వెళ్ళాలనీ చెప్పినట్టు ఒక గుమాస్తా ద్వారా తెలిసింది.

జులై 12వ తేదీన మోలర్, వాన్‌విక్ గునపం, పారలతో కారెక్కి బయల్దేరారు.

వాటర్‌వాల్ — వాన్‌విక్ పుట్టి పెరిగిన ప్రదేశం. ఆ ప్రదేశంలో ఆరాలు తియ్యమని నేను ఇద్దరు డిటెక్టివుల్ని పంపాను. వాన్‌విక్ 'ఆ నాటి సాయంత్రం' వచ్చినట్టూ, మధ్య దారిలో కారు చెడడంవల్ల మిసెస్ హాఫ్మన్ అనే ఆమెను 'టార్చిలైట్' అడిగినట్టూ, ఆమెదగ్గర లేక పోవడంవల్ల— ఆ రాత్రి తన యింట్లో పడుకోవచ్చనీ, 'పక్కలు' ఏర్పాటు చేస్తానని ఆమె చెప్పినట్టూ — కాని, వాన్‌విక్ తల అడ్డంగా వూపి, ఆ రాత్రి ఏది ఏమైనా, ప్రయాణం వాయిదా పడ్డానికి కుదరదని చెప్పినట్టు తెలిసింది.

వాటర్‌వాల్ గాలించమని నేను ఆదేశం పంపాను. మోలర్ కనబడకపోవడం గురించిన పంజాయిషీ — వాన్ విక్ తనంతట తానే వచ్చి చెప్పి, పోలీసులకు సహాయం చేస్తే మంచిదని పేపర్లలో — దినపత్రికలలో ప్రకటించాము. ఈ ఉచ్చులో అతను యిరుక్కుంటాడన్న నమ్మకం నాకు లేనేలేదు. కాని, 'జోహాన్స్‌బర్గ్ స్టార్' పత్రికలో ఈ విషయం చూసి, అతను గమ్మున రైలెక్కి బ్లూమ్‌ఫాన్‌టీన్ వచ్చాడు. మోలర్ కనబడకపోవడంవల్ల తన సహాయం మేము కోరామని అనుకుని ఉంటాడే గాని, తనని అనుమానించామన్న అనుమానం లేశమైనా ఉండి ఉండదని నే ననుకున్నాను.

ఈలోగా—మా సిబ్బంది వాటర్‌వాల్ పొలాలలో ఒకచోట నక్కు తవ్విన గొయ్యి ఒకటి చూశారు. అది యిటీవలే పూడ్చినట్టు అనుమానించారు. ఆ గొయ్యి తవ్వేసరికి మోలర్—శవం బయటపడింది. రెండున్నర అడుగుల లోతులో అతని శవం బోరగిల్లా కూరబడి ఉంది. అతని చొక్కా—వెనకభాగంలో ఒక కన్నం కనబడింది వెన్ను—భాగంలో ఒక పెద్ద గాయం కూడా ఉంది. మంచి పదునైన ఆయుధంతో అతన్నెవరో గాయపరచి ఉండాలి. చొక్కా, లాగూ—గుండీలన్నీ తెంపబడినట్టున్నాయి.

పోస్ట్‌మార్టమ్ సమయంలో అక్కడే ఉండాలని వాటర్‌వాల్ వెళ్ళాను. దగ్గరలో ఉన్న ఒక షెడ్‌లోకి అతని శరీరాన్ని తీసుకు వెళ్ళారు. ఆ షెడ్‌లో ఓ పారఫిన్—బల్బు వెలుగులో 'పని' ప్రారంభమయింది. ఎంత దారుణాన్ని చూసినా—భయపడడం గాని, అసహ్యించుకోడం గాని, హడలిపోడం గాని, పోలీసు—శాఖవారికి పనికిరాదు. అలాటివాటిని తట్టుకునే తరిఫీదు ఉంటుంది. కానీ, ఆనాటి 'పని' దాన్నికూడా జయించింది. మోలర్—తల ముక్కలై కోడిగుడ్డు సైజుకి చేరింది. వెన్నులో తగిలిన గాయానికి మోలర్ చచ్చేలోగా, యమయాతన పడిఉండుండాలనిపించింది నాకు.

ఆ నక్కు తవ్విన గొయ్యి దగ్గర 'పెనుగులాడిన ఆనవాళ్ళు' ఏమీ కనుపించలేదు. నీటి పంపుకి కొంచెం దూరంలో ఒక పారా, గునపం కనుపిం

—33 వ పేజీ చూడండి

## నా అనుభవంలోకెల్లా పెద్ద పరిశోధన-13



"నాట్యం నాహాబీ అదే నాకళాసేవకూడా"

'సొంత ఊరు' లో ఈమెను ఎన్. టి. రామారావు ప్రక్కన చూసినవారంతా ఈమె టాలెంట్‌ను గుర్తించారు. రాజసులోచనకు జనంలో విశేషమైన ఒక ఆకర్షణ ఉన్నది. ఈ అప్పీలు ఒకవంక యీమెను నాట్యతారగా రాణింప జేస్తూవుంటే— సిన్సియర్‌గా తన విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చడమనే గుణంవల్ల నటిగా రాణింపూ వచ్చాయి.

## తెరమీద-తెరవెనుక

తన ట్రూప్‌తో ప్రదర్శన లిస్తున్నది. పైగా దేశరక్షణ నిధి నిమిత్తం సినీతారల కార్యక్రమంలో పాల్గొనబోతున్నది. అందుకనే "తను హనీమూన్" ను పరిమితం చేసుకున్నా నన్నదామె నాతో

మంచి మనసుకు మంచి రోజులు దర్శకుడు

గట్టిగా ఆలోచించుకునే వచ్చాం. నాకెంతో ఆనందంగా ఉంది."

నిజమే; శ్రీమతి రాజసులోచన ప్రజలలో మంచి పేరూ, ప్రఖ్యాతి చాలా కొంచెం రోజుల్లోనే ఎక్కువ తెచ్చుకున్న తార.

ఆ యిద్దర్నీ అభినందిస్తూ "ఊటీ వెళ్తున్నా



మెడలో నగలు, సిగలో పూలూ ఇవి పువ్వుకు తావి ఎంతో ఆడవాళ్లకి అంత అలంకారాలు—రాజసులోచన.

## కూచిపూడికి సేవ

"కూచిపూడి నృత్య మంటే నాకు చాలా యిష్టం" అంటుంది శ్రీమతి రాజసులోచన.

ఇప్పుడు ఈ శీర్షిక క్రింద యీమెను పరిచయం చేసేముందు కొత్తగా పెళ్లి చేసుకున్నది గనుక యీమెను అభినందించకుండా తతిమ్మా విషయాలు రాయడం భావ్యంకాదు. (చూడుడు 10—5—63 సంచిక) విరివిగా దేశంలో యీమె సి. ఎస్. రావు నామె వివాహం చేసుకున్నది.

ఆ రోజా పత్రికా ప్రతినిధులతో శ్రీ రావు యీ విషయమై ముచ్చటిస్తూ గర్వంగా యిలా అన్నారు: "రాజసులోచనను చాలా మంది పెళ్లి చేసుకోవా లనుకున్నారు—కాని ఆమె దొక జీనియస్ బుర్ర— బహు సున్నితమైన మనసు—ఈ నిర్ణయానికి మేం యిరువురం చాలా

మన్నారు—తర్వాత మరో పర్యటనా లేదా ?" అనడిగాను.

"నాకు జపాన్ ట్రూప్‌తో టూర్ చేయాలనుంది." అన్నదామె.

### ప్రపంచ పర్యటన మోజు

వెనుకటికి నేను ఇంటర్వ్యూ చేసినప్పుడు కూడా శ్రీమతి రాజసులోచన తనకు నృత్యప్రదర్శనలిస్తూ పర్యటించాలనున్నట్లు చెప్పింది.

# మంచిపనిచేసిన హంతకుడు

27—వ పేజీ తరువాయి

చాయి. మరికొంత దూరంలో బురదతో ఉన్న—'యస్ వాన్ డబ్లియు' (S Van w) అనే గుర్తున్న మేజోళ్లు దొరికాయి. ఈలోగా—వాన్ విక్ 'పేపరు ప్రకటన' చూసి, బ్లోమ్ ఫౌన్‌టీన్‌కి వచ్చినట్టు వార్త వచ్చింది

"పత్రికా ప్రకటన చూసి అర—సెకను కూడా వృధా కాకుండా, అతి త్వరగా—అందిన రైల్లో వచ్చాను. మా మేనల్లుడు ఏమయ్యాడో—మీరు కనుక్కోవాలి—నా శక్తివంచనలేకుండా సహాయం చేస్తాను" అని డ్యూటీలో ఉన్నతనితో చెప్పాడు.

మోలర్‌ని హత్యచేసిన నేరంమీద అతన్ని—డ్యూటీ ఆఫీసర్ అరెస్టు చేశాడు. హత్యానేరం బనాయించి, ఒక వ్యక్తిని బుకాయించి, భయపెట్టి, నేరం ఒప్పుకునేటట్టు చేశాడనే నేరం తనమీదకు వస్తుందనే భయంతో ఆ ఆఫీసర్, వాన్ విక్ వద్దనుంచి వ్రాతమూలకంగా ఏమీ తీసుకోలేదు

ఆనక, వాన్‌విక్ తరఫు లాయర్లు అతన్ని వాటర్‌వాల్‌లో ఆ సంఘటన జరిగిన చోటుకు తీసుకు వెళ్లి—ఆ విధానం పరిశీలించడానికి 'న్యాయశాఖ' అనుమతి కోరారు. డిఫెన్సుకు సంబంధించిన ఫొటోగ్రాఫర్, ఒక డాక్టరూ 'ఆ నక్క గొయ్యి' దగ్గరకు చేరారు. వాన్‌విక్ తన 'కథనం' ప్రారంభించాడు.

మూడువేల పౌన్లున్న ఒక పెట్టె వాటర్‌వాల్‌లో—ఒక నిర్ణీత స్థలంలో పాతిపెట్టబడి ఉంది. వాన్ విక్, గత సంవత్సరంలో చేసిన ఒక దొంగతనంలో దొరికిన మూడు వేల పౌన్లు—తనను పోలీసులు పట్టుకునేలోగా, తిరిగివచ్చి అనుభవించడానికి అనువైన చోట దాచాడు.

మేనల్లుడితో వాన్‌విక్ బయలుదేరిన ఆనాటి రాత్రి కటిక చీకటి—

"—మేము దాచినచోట పద్దెనిమి దంగుళాల లోతులో ఉన్న గోతులు రెండు కనిపించాయి. ఏ గోతులో ధనం దాచానో గుర్తు తెలియక, రెండూ తవ్వి చూడాల్సివచ్చింది. నేను తవ్వడం, మోలర్ మన్ను తియ్యడం అని నిర్ణయించుకున్నాము ఓ పార—మన్ను తీశాక, దాచిన పెట్టెపైన పెట్టిన రాయి తగులుతుందేమోనని గునపంతో, గునపాయించాను

"ఈలోగా మోలర్, తనకి దాహం వేస్తోందనీ, నీళ్లెక్కడ దొరుకుతాయనీ అడిగాడు. కొంచెం దూరంలో ఒక పంపుందని నే నన్నాను నేను చూపించిన వైపుకు చూడాలని, వంగి మన్ను తీస్తున్న మోలర్ తన వీపుమీదుగా వెనక్కి తిరిగాడు అదే సమయానికి నేను గునపంపెట్టి తవ్వబోయాను. అతనలా తల ఎత్తడంవల్ల బహుశా నా చేతిలో ఉన్న గునపం అతనికి తగిలివుండచ్చని నే నిప్పుడు ఊహిస్తున్నాను మరో నిముషంలో అతను మెలికలు తిరిగిపోయాడు. చేతిలో గునపం గిరాటేసి, అతన్ని ఆదుకోబోయాను కానీ, అతనాలోగానే ఎగిరి ఆ గోతిలో పడ్డాడు ఆదుర్దాపుకి నేను గింగిరాలు తిరిగాను. పెద్ద వస్తువు పడిన శబ్దం అయింది .... "

'... నాకు శబ్దం వినిపించడమే గాని, ఏమీ కనుపించడంలేదు కన్ను—పొడుచుకున్నా కనబడనంత చీకటిలో—అతనికోసం ఆ గొయ్యిలో తడుముకున్నాను అతని శరీరం ఆ గొయ్యిలో మెలికలు తిరిగిపోయింది. గునపం అతనికి తగిలిందేమో! బాగా గాయం అయింది. ఆనక ఏం జరిగిందో నాకు గుర్తులేదు. ఆ భయంకర దృశ్యం నా జ్ఞాపకశక్తిని మొద్దుబార్చి ఉండచ్చు..." అంటూ, ఏకధాటిన చెప్పి వాన్‌విక్ ఆగాడు.

"ఆనక ఏం జరిగిందో మీ కసలు గుర్తే లేదా" అని జైలు అధికారి—యఫ్. పి. డీవెట్ అడిగాడు.

"ప్చ్—తెలీదు. ఎలా వచ్చానో, కారు దగ్గరకు వచ్చేసరికి స్పృహ వచ్చింది. నా కళ్లు చెదిరిపోయాయి. లబ్బున ఏడవాలనిపించింది జుట్టు పీక్కుని చావాలనిపించింది. ఏం చేస్తున్నానో నాకే తెలియలేదు. గమ్మున కార్లో ఎక్కి వీలైనంత దూరం పారిపోవాలని—పోయాను."

వాన్‌విక్ గునపం పుచ్చుకుని, ఆనాటిరాత్రి తను నించున్న పద్ధతిలో నించున్నాడు. అతని 'లాయర్'—హతుడు మోలర్ కూర్చున్న పద్ధతి తెలుసుకుని, ఆ పద్ధతిలో కూర్చున్నాడు. ఫొటోగ్రాఫర్ ఆ 'పోజుని' వివిధ కోణాల్లో ఫొటోలు తీశాడు అదే పద్ధతిలో ఉన్నపుడు గొయ్యివద్ద కూర్చుని, మట్టి తీస్తున్నవాడు లేచి, వంగి వెనక్కు చూస్తే—మోలర్‌కు తగిలినచోటే గాయం తగుల్తుందని తేల్చారు ఈ తతంగాన్ని అతి శ్రద్ధగా చూస్తున్న డాక్టరు, మోలర్— చావు కేవలం ప్రమాద సంఘటనే గాని, బుద్ధిపూర్వకంగా వాన్‌విక్ చంపివుండ వీల్లేదని వక్కాణించాడు "అది సంభవమే! పరిస్థితి, స్థితి- వర్ణనలను బట్టి వాన్‌విక్ చెప్పింది జరగడానికి అవకాశం ఉంది. అతను చెప్పిన పద్ధతిలోనే మోలర్ మెలితిరిగి పడిపోయిఉండి తీరాలి" అన్నా డాయన.

పారా, గునపం ఎందుకు వదలివేయవలసి వచ్చిందో, మేజోళ్లు విప్పి—పారెయ్యడానికి కారణం ఏమిటో— వాన్‌విక్ చెప్పలేకపోయాడు. ఆ సమయంలో—అతని మనస్సు బండబారిపోయిందనీ, జరిగిన ఏ సంఘటనా కూడా లేశమైనా తనకు గుర్తు లేదనీ, టకాయించి చెప్పాడు.

మోలర్—హత్యానంతరం వాన్‌విక్ ఒక శరణాలయానికి వెళ్లాడు. ఆ రాత్రి వాన్‌విక్‌కి స్మృతిలోపం కలిగినట్టు సాక్ష్యం చెప్పి, ఆ శరణాలయం వారు 'ఈ కథ' కి మరికొంత బలం చేకూర్చారు. దీనికి తోడు "ఆత్మ—తత్వజ్ఞులు" 'అతని'కి జరిగిన సంఘటన లాటిది జరిగితే—మానసిక స్మృతి కోల్పోవడం న్యాయమేనని చెప్పి 'అతని కథ' కు మరికొంచెం మద్దతు యిచ్చారు.

కాని, డిఫెన్సువారి ఈ వాదాన్ని కడు విపరీతమనీ, నమ్మడానికి వీల్లేదని అభిప్రాయపడ్డాను. ముద్దాయి వాన్‌విక్ — అక్టోబరు 21 (1930)వ తేదీన బోనులో హాజరయ్యాడు ఫ్రీ స్టేట్ ప్రెసిడెంటు— సర్ ఎటినీ విలియర్స్—ఆనాడు జడ్జి

కటికచీకట్లో అజాగ్రత్తగా, తొందరగా, 'నిర్ణీత స్థలం' నుంచి కదలడంవల్ల మోలర్ తన చావుని తనే కొనితెచ్చుకున్నాడని వాన్‌విక్ వాదించి తన కథ ముగించాడు.

ప్రాసిక్యూషన్ తరఫు ఎటార్నీ — జనరల్ డబ్ల్యు. జీ హెయిల్, వాన్‌విక్ చెప్పినదంతా కేవలం కథనీ, మోలర్ వంగి, భుజాలమీదుగా నీటి పంపు కనపట్టం అనేది కేవలం ఊహాగానమనీ, ఫొటోగ్రాఫర్లు తీసిన ఫొటోలు కేవలం వాన్‌విక్ కథకి అనుకూలాలే గానీ, నిజాన్ని నిరూపించేవి కావనీ, 'ఆనాటి రాత్రి' మోలర్ నించున్న ప్రదేశాన్ని వాన్‌విక్ చూపించితే, అక్కడ నిలబడిన వ్యక్తికి తీసిన ఫొటోలే తప్ప, మోలర్‌కి తీసినవి కావనీ—ఆ రాత్రి మోలర్ అక్కడే నిలబడి ఉన్నాడని అనుకోడానికి నిదర్శనాలు లేవనీ — కేవలం వాన్‌విక్ చెప్పినట్టు ఫొటోలు తీయడంవల్ల—అవి అతని కథకి మరింత గట్టి పట్లు అయ్యాయనీ ఉద్ఘాటించాడు

మూడు గంటల భయంకర నిశ్శబ్దం తరువాత "అతను నిపరరాధి"— అని జ్యూరీ నిర్ణయించింది

* * *

ఆ మర్నాడు బజార్లో జ్యూరీలు నన్ను కలిసి,—'మరేమనుకోకండి. జడ్జి కావాలని అతన్ని వెనకేసుకొచ్చినపుడు—ఆయన్ని కాదని మనం ఎలా పోతాం—ఏమంటారు' అన్నారు.

నాకు వళ్లు మండి, "మంచిదే! కానీ, మునిగిపోయిందేమీ లేదు మరో ఆర్నెల్లలోగా వాన్‌విక్—జైలు కటకటాల్లోపల ఉంటాడు అప్పుడు మాత్రం అతన్నెవరూ రక్షించలేరు కానీ, ఎవరో ఒక నిర్భాగ్యులు మాత్రం అతని దారుణానికి బలి అవ్వాల్సి ఉంటుంది" అన్నాను

* * *

మూడు నెలలు దాటాక దారుణమైన మరో హత్యాకాండ జరిగింది ఆ కాండకు బలైన వ్యక్తి —బ్రిటిష్ దేశవాసి—క్రిల్ గ్రిగ్ టకర్. అతనికి 'ఆపిల్డార్న్' లో ఒక 'స్టాక్ ఫారమ్' ఉంది. అతని ఇంటికి సమీపంలో పాతిపెట్టబడిన ఒక పెట్టెలో అతని శరీరం కనుగొన్నాము అతన్ని చంపడానికి ఉపయోగించబడిన రక్తసిక్తమైన సుత్తి—సామాన్ల గదిలో దొరికింది

అనుమానితుని ఆనవాళ్లు దేశంలో అన్ని పోలీసు — శాఖలకూ వచ్చాయి. కొంచెం పీలగా ఉంటాడనీ, బట్టతల, కొంచెంగా మెలి తిరిగిన

---

ఒకానొక విలేఖరుడికి ఓ మేయరుగారు విందు చేశారు. ఆ పెద్దమనిషి ఇంటికి పోబోతూ మేయరుగారి టోపీని పొరపాటున పట్టుకుపోయాడు.

మర్నాడు మేయరుగారికి ఓ ఉత్తరం వచ్చింది.

"అయ్యా! మీ టోపీ పొరపాటున పట్టుకుపోయాను. కానీ, మీ సన్మానానికి చిహ్నంగా ఇది ఉంచుకోదల్చుకున్నాను. మీసౌజన్యానికి ధన్యవాదాలు."

రమాకాంత్ (బొంబాయి)

---

# మంచిపనిచేసిన హంతకుడు

మీసాలు ఉంటాయనీ, మనిషి—ఆరెంజ్ ఫ్రీస్టేట్‌కి చెందినవాడై ఉండాలనీ అందులో తెలిపారు.

టక్కర్‌తో—అతని 'ఫారమ్' కొనే టక్కరి వ్యాపారం చేయబోయాడని కూడా తెలిసింది.

నా—"జోస్యం" వే ననుకున్న సమయంకన్నా ముందుగానే నిజమయింది. ఈసారి కూడా అతను పిచ్చివాడిలా 'అత' నో చిన్న కథ చెప్పి 'పాపం పిచ్చివాడు' అనిపించుకుని, తప్పించుకుందామనుకున్నాడు గానీ, కుదర్లేదు వాన్‌విక్ మరణశిక్ష పడింది చివరి రోజుల్లో తన పాపాలన్నీ కడిగేయమని దేవుణ్ణి ప్రార్థిస్తూ—అతను బైబిల్ చదివేవాడు. 1931 జూన్ 12 వ తేదీన అతన్ని ఉరితీశారు.

* * *

ఒకరోజున మిసెస్ మోలర్ నా ఆఫీసుకు వచ్చి—తన తమ్ముడు వాన్‌విక్ తనకు రాసిన ఒక ఉత్తరం నాకు చూపించింది. నేను దాన్ని ఆశ్చర్యంతో చదివాను .....

"—లాయీసా అక్కయ్యకు .....

నీకు చేసిన ఘోరానికి క్షమించమని అడిగే అర్హత కూడా నాకు లేదు. నీ కొడుకును నేనే చంపాను. 'జీసస్' కోసం నన్ను క్షమించు.

అకారణంగా పాపం వాణ్ణి చంపాను. అక్కడ 'నిధి' లేనే లేదు కేవలం చంపాలనే తీసుకువెళ్లాను. కానీ, నేరం చేసి, హత్య చేసి, నేను నిరపరాధిగా నిరూపింపబడింది ఆ ఒక్క కేసులోనే !! వచ్చి అబద్ధాలవల్ల సునాయాసంగా ముప్పు తప్పించుకొన్నాను కానీ, మరో కేసులో ఇరుక్కున్నాను" అని ఉంది.

వాన్‌విక్ "అంతా మనదే" అనే సిద్ధాంతం కలవాడు అందరి డబ్బూ మనకి వచ్చేస్తే బావుణ్ణు అనే ఆశ కలవాడు.

'క్రిల్‌గ్రిగ్ టక్కర్' ఫారం తను కొనేసినట్టు దొంగ—దస్తావేజులు పుట్టించి, అది జనానికి తెలియకుండా ఉండాలని—అతన్ని మాటుపెట్టి, పాతిపెట్టి — ఎవ్వరికీ తెలియదని నిబ్బరంగా గాలి పీల్చాడు. ఒక హత్యచేసి, 'నిర్దోషి' బిరుదు పొందడంవల్ల — 'అదే' పట్టాలమీద నిశ్చింతగా ప్రయాణం చెయ్యవచ్చనుకున్నాడు.

* * *

తనకి నమ్మకద్రోహం చేశాడని మోలర్‌ని గనుక చంపడం 'నిజం' అయ్యుంటే, చంపే సావకాశం, అవకాశం అదే అయ్యుండాలి. వాటర్‌వాల్‌లో దాచిన 'నిక్షేపం' — నిక్షేపంగా తనూ, తన మామయ్యా తెచ్చుకోవచ్చనే ఊహ మోలర్‌ని అసలు కారణం వూహించనివ్వలేదు. చివరికి వాన్‌విక్ — తప్పంతా తనదేననీ, మోలర్ ఏ పాపం ఎరగడనీ, కుటుంబానికి చెడ్డపేరు తెచ్చే ఏ పనీ మోలర్ చెయ్యలేదనీ—రాసి—మిసెస్ మోలర్ కుటుంబానికి చెడ్డపేరు రాకుండా మాత్రం చేశాడు.

జీవితమంతా చెడ్డపనులు చేసి, చెడు తిరుగుళ్లు తిరిగి, చివరికి హత్యలు కూడా చేసిన వాన్‌విక్ తన జీవితంలో చేసిన మంచి పని అదొక్కటే !! ★

# అనుమానం

25— వ పేజీ తరువాయి

ఈ వెంకటాపురం. ఉదయము పైపాడునుండి వస్తూ, ఒక బంగారు గొలుసును సుమారు రెండు తులాలది పోగొట్టుకున్నాడు. వాడేమో తన సంచిలోనే పెట్టి, ఆ సంచిని బస్సులోనే విడిచివచ్చాడు. వీడి అక్క పైపాడులో ఉంది. తల్లి కివ్వమని ఆ గొలుసును వీడికిచ్చిందట. ఆ గొలుసును తన పాత అంగీ - జేబులో పెట్టి సంచిలో ఆ అంగీని తురికాడట. ఇక్కడికి రాగానే, సంచిని మరిచి, తొందరగా బస్సు దిగాడుట. బస్సు వెళ్ళిపోయిం తర్వాత జ్ఞాపకానికి వచ్చిందట. ఏడ్చుకుంటూ ఊళ్ళోకివచ్చి వాళ్ళమ్మ ముందర చెప్పాడట. పాపం! ఆమె ఏంచేస్తుంది? ఇంటిప్రక్కన ఉన్న పట్వారి పాలిమియాతో ఈ విషయం చెప్పడానికి వచ్చింది. అప్పుడు అక్కడే ఉన్న నేనూ - పాలిమియా ఆమెమాటలు విని,' ఈ అబ్బాయితో కలిసి వచ్చాం' అని వివరంగా చెబుతూ, ఆయాసపడుతూ ఆగాడు.

ఆ అబ్బాయి కళ్ళల్లో భయంతో కూడిన నీరు చిప్పిలుతూంది. పాలిమియా తన ఎడమచేతితో తల గోక్కుంటూ నిలబడ్డాడు. చిన్నగా గాలి వీస్తోంది. రాయచూరునుండి కర్నూలుకు వెళ్ళే బస్సు వచ్చువరకు అక్కడే ఉండి; ఆ బస్సులో సంచి ఉందా లేదా అనే సందేహాన్ని తీర్చుకోవాలని వారంతా నిల్చున్నారన్నమాట.

"రాయచూరుకు వెళితే అంతా తెలిసిపోతుందిగా" అన్నాడు హఠాత్తుగా; పాలిమియా తల గోక్కోవడం విడిచి. మునుగుతూన్న సూర్యుని పండిన కిరణాలు అతడి మొహంపై పడుతూన్నాయ్. నున్నని అతడి మొహం మెరుస్తూంది.

"అవును!" అని నేను అన్నా ఆలోచించకుండా.

"ఎలా తెలుస్తుంది?" అడిగాడు వెంకటస్వామి.

"అదేమిటోయ్ అలాగంటావ్. బసెస్ హాల్ట్సు అక్కడే కదా. ఆ డిపోలో ఉన్న క్లీనర్లు ఎవరేనా తీసుండవచ్చు. లేకపోతే, బస్సు కండక్టరే చూచి డిపోలో అప్పగించి ఉండవచ్చు" అన్నాను.

"నేను అనేదీ అదే" అన్నాడు పాలిమియా ఉత్సాహంగా తల గోక్కుంటూ.

"నాకేమొ నమ్మికలేదు" వెంకటస్వామి పశ్చిమ దిక్కుకు తిరిగి అట్టువు చూస్తూ గొణిగాడు.

ఆ అబ్బాయి ఏమీ మాట్లాడ్డం లేదు. అక్కడ మాగినవారంతా చాలామటుకు వెళ్ళిపోయారు. సా॥ 5½ గంటల బస్సు వెళ్ళిపోయింది.

నేను 7 గంటల బస్సు వచ్చేవరకు ఇక్కడే ఆగాలి.

దూరంగా బస్సు శబ్దమైంది.

ఆత్రుతతో అటువైపు చూస్తూ నిల్చున్నాము.

అది బ్రరున వచ్చేసింది. అది బస్సుకాదు; ఎం. జి. వాళ్ళ లారి.

మాకు ఎంతో కోపం వచ్చింది

నిరాశతో నిలబడ్డ ఆ అబ్బాయి రోడ్డు ప్రక్కన ఉన్న పచ్చికపై కూర్చున్నాడు.

"అక్కమ్మా! నాలుగు చా" అని ఆర్డరు ఇచ్చాడు వెంకటస్వామి.

రోడ్డుకు అవతలి ప్రక్కనఉన్న చిన్నగుడిసెలో మిణుకు మిణుకుమంటున్న ఒక వెలుగు వెలిగింది. ఉఫ్ఉఫ్ మని ఊదుతున్న శబ్దం వినవచ్చింది.

## అనుమానం

అక్కమ్మ అక్కడ క్యాంటీన్ పెట్టకుంటే, మాలాంటి ప్రయాణీకులకు ఎంత ఇబ్బంది! ఈ బస్సులు ఇలా రోజూ లేటై వస్తూ ఉండాలని పాపం! అక్కమ్మ కోరుతూ ఉండవచ్చు. అందుకే ఆ క్యాంటీన్‌లో ఉన్న "మోహన వంశీ" పటం ముసిముసి నవ్వులు విసురుతుంది.

వెంకటస్వామీ, పాలిమియాలు నిలబడలేక కూర్చున్నారు.

"పాలీ, అగ్గిపెట్టె ఇలా ఇవ్వు." మూడోనంబరు బీడీని నోట్లో పెట్టుకుని, కొనను కొరికి ఊస్తూ అడిగాడు వెంకటస్వామి.

అగ్గిపెట్టెను వెంకటస్వామి కందించాడు పాలి

ఎందుకో నా మనసుకు విసుగనిపించింది. వాచి చూసుకున్నాను. 6 గంటలు కావస్తోంది.

పొడుగ్గా, కొద్దిపాటి నల్పు ఛాయతో, అప్పుడప్పుడే యవ్వనంలోకి ప్రవేశించబోతూన్న అక్కమ్మ బిడ్డ జయ నాలుగు 'టీ'లు తెచ్చింది.

డికాషన్ స్ట్రాంగ్‌గా ఉన్నది. టీ త్రాగుతూ ఉంటే, గొంతులో నాకు మంటగా అయింది. టీ త్రాగామో లేదో 'బస్సు' నేనొచ్చానని హారన్ ఇచ్చుకుంటూ వచ్చి ఆగింది.

ఉరుక్కుంటూ వెళ్ళి వెంకటస్వామి కండక్టరుకు విషయమంతా చెప్పాడు. ఆ అబ్బాయిని లోపలికి విడిచాడు కండక్టరు. అప్పటికే లేటైందని లోపలి ప్రయాణీకులు విసుక్కుంటున్నారు. వీడు సంచిని మరచిన బస్సు అదే ఆ సంచికూడా వాడు పెట్టినచోటే ఉంది.

సంతోషంతో సంచిని పట్టుకుని అబ్బాయి బస్సు—దిగాడు బస్సు వెళ్ళేలోగా సంచిలో గొలుసుందో లేదో చూడమన్నాను.

"అదేనా మీ పోయిన సంచిఅని

కడిగాడు కండక్టర్నూ'?

లోపల ఉన్న ప్రయాణీకులు సైతం ఉత్సుకతతో చూస్తున్నారు.

ఆ అబ్బాయి సంచిలోని తన పాత అంగీని బయటికి తీసి జేబులో చెయ్యిపెట్టిచూశాడు. కాని, దాంట్లో ఏముంది? గొలుసు లేదు. వెంకటస్వామి, పాలిమియాలు కూడ వెతికారు. బస్సులో అబ్బాయి కూర్చున్నస్థలంలో క్రిందా మీదా వెతికారు. కాని,లాభం లేకపోయింది.

"ఇక తప్పనిసరిగా కర్నూలు డిపోలో రిపోర్టివ్వాలిసిందే" అన్నాడు పాలిమియా. కండక్టర్ బెల్ మ్రోగించాడు. తొందరగా ఆ బస్సులో వెంకటస్వామీ, ఆ అబ్బాయీ వెళ్ళిపోయారు.

"గొలుసును కండక్టరే తీసుండవచ్చు." అన్నాడు పాలిమియా.

"అది అసంభవం. తన దొంగతనాన్ని బాహ్యంగా తెలుపుకునేట్లు ఆ సంచిని మళ్లీ యథాస్థానంలో ఉంచుతాడా?" అని అన్నాను.

"ఏం? ఎందుకుంచకూడదూ? అలా ఉంచినందువల్లే అతణ్ణి దొంగగా గుర్తించమని అనుకుని ఉండవచ్చుకదా?" ఎడమ చేతిని తలపైఆడింపుకుంటూఅన్నాడుపాలీ.

"అవును; అదీ నిజమే."

"రిపోర్టిచ్చినా, ఇంక ఏమిచ్చినా ఆగొలుసు చేతికింకరాదు"అన్నాడు పాలి.

నా బస్సు వచ్చింది. అందులో నుండి వాపసు వచ్చారు వెంకటస్వామీ, ఆ అబ్బాయిన్నీ; ఇంకో ఆయనానూ.

ఆశ్చర్యపోతూనే నేను బస్సు ఎక్కాను.

"గొలుసు దొరికిందోయ్" అన్నాడు వెంకటస్వామి.

"ఎట్లా?"

"ఈ అబ్బాయి, అసలు గొలుసు తీసుకురాలేదట. నకిలీ గొలుసు ఇచ్చిందట."

"అబ్బాయి పోగొడతాడని వాళ్లక్క ఇవ్వలేదట. ఇదో ఈయన ఈ అబ్బాయి బావగారు. ఈయనే స్వయంగా గొలుసు తీసుకుని వచ్చాడు" అని ఆ అబ్బాయి బావను చూపించాడు.

అతడు నవ్వుతూన్నాడు మూడో నంబరు—బీడి వెలిగించాడు వెంకటస్వామి.

పాలి తల గోక్కుంటూ నిలబడ్డాడు.

బస్సు కదిలింది. ★

---

ఆనందాన్ని జుర్రుకోవాలనుకున్నానో, అంతా అనుభవించాను! నన్ను వెలివేసి అవమానించినందువల్ల నాలో ఆత్మవిశ్వాసం పెరిగింది! నా స్వతంత్ర అభిప్రాయాలమీద విపరీతమైన గౌరవం వచ్చింది.' ఆయన నవ్వుతూ, కొంచెం ఆవేశపు పాళ్ళు గూడా మిళాయించి చెపుతున్న మాటలను మూర్తి శ్రద్ధగా విన్నాడు.

ఆయన— ధైర్యం, విశ్వాసం చూసి మూర్తిలో గౌరవం రెండింతలు పెరిగింది! మామయ్యవైపు ప్రేమగా చూశాడు.

—ఒక అందమైన అమ్మాయి గదిలోకి ప్రవేశించటంతో, వారి మాటలు ఆగిపోయాయి. ఆ అమ్మాయి గౌరీపతిగారికి ఏదో చెప్పటానికి ఆదుర్దాగా వచ్చి, తనకు అపరిచితుడైన వ్యక్తి ఉండటంతో, అక్కణ్ణించి నిష్క్రమించటానికి ఉద్యుక్తురాలైంది.

'ఆగు మంజులా!' అన్నారు గౌరీపతిగారు. ఆమె ఆగిపోయింది.

'ఏమమ్మా! ఏమిటో చెప్పటానికి వచ్చావ్?' అన్నారు ప్రేమగా కూతుర్ని చూస్తూ.

'బయట ఎవరివో సామాన్లున్నాయి! చిమ్మటానికి అడ్డం! ఎక్కడ పెట్టించాల్నో తెలియక' మంజుల చెప్పిన మాటలను విని మూర్తి తికమకగా 'అవి..... ..నావేనండీ!' అన్నాడు.

మంజుల అతన్ని సూటిగా చూసింది!

'మంజూ! ఇతని పేరు మధురమూర్తి! మా సుందరి కొడుకు. నీకు బావ!' తండ్రి చెప్పిన పరిచయ వాక్యాలు విని, మంజుల 'మేనబావ'గా అతన్ని పరకాయించి చూసింది. బంధువులు చాలా తక్కు

## తెలియని పిలుపులు

19 వ పేజీ తరువాయి

వగా ఆమెకు తారసిల్లటంచేత — తమకు గూడా అందరిమల్లేనే బాంధవ్యపు సరిహద్దులు బరి గీయబడిఉన్నవన్న సంగతి ఆమె క్రొత్తగా వినటంవలన ఆశ్చర్యంగా చూసిన మాట నిజం!

మధురమూర్తి గూడా అప్రయత్నంగా ఆమెను చూశాడు. అతని కంటికి మంజుల చాలా మనోహరంగా కన్పించింది.

నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ, గౌరీపతిగారు అన్నారు—'మూర్తీ! మంజుల వెంబడి లోపలికి వెళ్ళి, కాఫీ అదీ తీసుకో, తీరిగ్గా ఉద్యోగ ప్రయత్నాల సంగతి తరువాత ఆలోచిద్దాం!' అన్నారు.

మంజుల వెంబడి నిశ్శబ్దంగా నడిచాడు మూర్తి.

* * *

రెండో రోజు మధురమూర్తిని గౌరీపతిగారు తనకు పరిచయమున్న మాధవరావుగారి దగ్గరకు తీసుకెళ్ళారు. ఆయన ఒక ప్రయివేటు కంపెనీ ప్రొప్రయిటర్! గౌరీపతిగారు మధురమూర్తిని గురించి చెప్పిన తరువాత ఆయన ఉద్యోగం ఇవ్వటానికి ఒప్పుకున్నారు. చిన్ననాటి మిత్రులవటంవల్ల ఆయన అంత తేలిగ్గా వాగ్దానం చేశారు.

ఇద్దరూ ఆయన దగ్గర శలవు తీసుకొని బయటకు వచ్చారు. గౌరీపతిగారు, మిత్రులు కలవటంవల్ల ఆయన వారితో ఆగిపోవాల్సివచ్చింది.

మూర్తి ఒక్కడూ హైద్రాబాద్ అందాలను చూసుకుంటూ, ఇంటికి చేరేసరికి పన్నెండు గంటలయింది.

ఇంట్లో ఎవ్వరూలేరు. అంతా నిశ్శబ్దంగా ఉంది. వంటమనిషి 'గౌరీపతిగారు ఇంకా ఇంటికి రాలేదనీ, మంజుల కాలేజీనుంచి వచ్చే సమయమయిందనీ' చెప్పింది.

మూర్తిని భోజనానికి లెమ్మంటే — 'కొంచెం ఆగి, అందరితోపాటు తింటానని' చెప్పి, గౌరీపతిగారి ఆఫీసు—గదిలో కూర్చున్నాడు.

ఆయన — గది చాలా అందంగా అలంకరించి ఉండటమే ఆ ఇంటికి ఒక ప్రత్యేకత. గదిలో టేబుల్‌మీద ఖరీదైన టేబుల్‌క్లాత్ పరిచివుంది. టేబుల్‌మీద వేదాంతానికి సంబంధించిన పుస్తకాలు పేర్చబడి ఉన్నాయి.

—ఊసుపోకకు ఏదన్నా చదువుదామని వెతుకుతున్న మూర్తికి అప్రయత్నంగా ఒక పాత డైరీ దొరికింది! అది భద్రంగా ఉంచబడటంవలన చెక్కు చెదరలేదు.

వద్దనుకుంటూనే, చూడాలనే అభిలాషను చంపుకోలేక, డైరీలోని పేజీలను గబగబా తిరగేశాడు. దాదాపు ఇరవై సంవత్సరాల క్రితం పాతకాలపు డైరీ అది. రాత కూడా కరక్కాయ సిరాతో రాయటంవల్ల గమ్మత్తుగా ఉంది.

తిరగేస్తుంటే, మూర్తి దృష్టి అనుకోకుండా కొన్ని పంక్తులమీదకి మరలింది.

"......జీవితంలో గడ్డు సమస్యను ఎదుర్కొన్న మొదటి రోజు ఇది! మేము వ్రాసుకున్న ప్రేమలేఖలు నాన్నగారి కంట బడ్డాయి. సుందరి చెప్పినట్లుంది ఈ రహస్యాన్ని గురించి....."

తల్లి—పేరు కనబడేసరికి అతను ఇంకొంచెం ఆసక్తితో చదవటం మొదలెట్టాడు.

# తెలియని విలువలు

"......నేను ఏ విషయమూ దాచుకోకుండా సుందరికి చెప్పాను—కానీ, సుందరి నాన్నగారి దృష్టికి ఈ విషయాలు ఎందుకు తీసుకొని వచ్చినట్లు?.... ఇహ బయపడటం అనవసరం. ఎప్పుడో ఒకప్పుడు బయట పడాల్సినవే"

ఇంకో పేజీ తిప్పాడు

"నాన్నగారు ఇవ్వాళ పిలిచి అడిగారు జీవితంలో మొదటి సారిగా ఆయన—ముందు ధైర్యంతో నిలబడ్డాను. అన్ని సంగతులూ చెప్పాను! నిజంగా అంత ధైర్యం నా కెట్లా కలిగిందో? .....తల్చుకుంటుంటేనే, ఆశ్చర్య మేస్తున్నది! కమలను పెండ్లి చేసుకోకుండా ఉండలేను అని స్పష్టంగా చెప్పాను."

ఆత్రుతగా ఇంకో పేజీ తిరగేశాడు

"—ఇది జీవన్మరణ సమస్య! అన్ని ఆశలూ నా మీదనే పెట్టుకున్న కమలను అన్యాయం చెయ్యలేను!....... చెయ్యను!.....ఉవ్వెత్తున లేచిన సముద్ర కెరటాల ఘోష మధ్యలో దారి తోచక నిలబడి ఉన్నాను ఇప్పుడు నేను వేయబోయే ఒక్కొక్క అడుగూ, తిరగబోతున్న ఒక్కొక్క మలుపు జీవితంలో...."

"—సుందరి నన్ను బలవంతం చేస్తున్నది నాన్న కుదిర్చిన సంబంధం చేసుకోమని, కులం లేని పిల్లను చేసుకుంటే భ్రష్టుణ్ణవుతానని బెదిరిస్తున్నది!.......కులాలూ, మతాలూ....... ఇవన్నీ ముళ్ళకంచెలు! వీటిని గురించి బెదరటం అనవసరం! నా నిశ్చయాన్ని మార్చలేరు."

"—సుందరీ, నాన్నా, అమ్మా—ఎవ్వరూ నన్ను అర్థం జేసుకోరేం? ఒక అమాయక జీవిని బలి పెట్టటానికైనా ఇష్టపడతారు గానీ, మనకు మనం నిర్మించుకున్న ఈ అడ్డుగోడలను పడగొట్టటానికి ప్రయత్నించరేం?"

—మధురమూర్తి కండ్లలో గిర్రున నీళ్ళు తిరిగాయి. గోడమీద అమర్చిన గౌరీపతిగారి ఫొటో మీదికి అప్రయత్నంగా అతని దృష్టి మళ్ళింది.

—మళ్ళీ డైరీ లోని ఇంకో పేజీ తిప్పాడు.

"జీవితంలో ఎదురైన గడ్డు రోజు ఇది! నేను వెళ్ళిపోతున్నాను! ......... చిన్నప్పటినుంచీ అల్లారు ముద్దుగా పెరిగిన నేను ఈ పరిసరాలను, ఇంటినీ అమ్మనూ, నాన్ననూ, చెల్లాయినీ.......అందర్నీ వదిలి వెళ్ళిపోతున్నాను......... నా కమలే నాకు సర్వస్వం! బావ—సమక్షంలో రిజిస్టర్—మేరేజీ చేసుకున్నాం. బావే అన్ని ఏర్పాట్లూ చేశాడు. ఎవరికీ తెలియకుండా!.......స్టేషనులో మా ఇద్దరికీ వీడ్కోలు ఇచ్చిన బావ మొఖాన్ని మరువ లేకుండా ఉన్నాను. ... బంధాలను తెంచుకుందామనుకున్నా, ఈ అనుబంధం మిగుల్తుందేం?"

డైరీని మూసివేశాడు. అతని కంటిముందు 'నాన్న' మెదిలాడు. కనురెప్పలను మూసుకుంటూ అస్పష్టంగా తన హృదయ—ఫలకంమీద ఏర్పడిన నాన్న—రూపానికి మెరుగులు దిద్దటానికి ప్రయత్నించాడు గానీ, అది చెదిరిపోయింది లిప్తకాలంలో... "అమృత హృదయుడు" అని గొణుక్కుంటూ డైరీని బల్లమీద పెట్టి ఏదో ఆలోచిస్తూ కండ్లను మూసుకున్నాడు.

—ఇంతలో బయట నవ్వడి వినిపించింది! టకటక చెప్పులను శబ్దం చేసుకుంటూ, మంజుల గదిలోకి వచ్చింది.

కను రెప్పలను మూసుకొని పరాగ్గా ఏదో ఆలోచిస్తున్న మూర్తి ఉలిక్కిపడి లేచాడు. ఆమె కనీసం అతడు అక్కడ ఉన్నాడన్న సంగతి గూడా గమనించనట్లుగా 'జానకమ్మా! అన్నం పెట్టూ!' అంటూ లోనికి వెళ్ళిపోయింది.

సరదాగా మంజులతో మాటలను కలుపుదామనుకున్న మూర్తికి ఆశాభంగమయింది. అతను మంజులతో ఎన్నో విషయాలు చెబుదామనుకున్నాడు! మామయ్య విషయంలో తల్లి సానుభూతి లేకుండా ప్రవర్తించినందుకు క్షమార్పణ చెప్పుకుందామనుకున్నాడు!—మామయ్యను గురించి తనకున్న అభిప్రాయాలూ, ఆయన్ను చూడకముందు తను వివిధంగా హృదయంలో రూప—కల్పన చేసుకున్నదీ........ఇంకా ఎన్నో?

—జానకమ్మ వచ్చి భోజనానికి పిల్చింది. అతను లేచి డైనింగ్ హాల్లోకి నడిచాడు. అక్కడ ఎవరూ లేరు! టేబుల్‌మీద తనొక్కడికే ఏర్పాట్లు చేసి ఉన్నాయి.

'మంజుల తినదా?' కూర్చుంటూ అడిగాడు.

'తరువాత తింటుందట' — వంట—మనిషి జవాబిచ్చింది.

'ఇలా రమ్మను' విషయ మేమిటో అర్థంగాక ఆమెను పిల్చి కనుక్కుందామనుకున్నాడు.

—మంజుల విసురుగా లోపలినుండి వచ్చింది.

"మంజులా! భోజనం చేయవా?" అడిగాడు అతను.

'చేస్తాను' ఆమె రూక్షంగా జవాబిచ్చింది.

"ఇంకేం— ఇద్దరికీ వడ్డించండి" అని వంట మనిషికి పురమాయించాడు.

'ఇప్పుడు నేను తినను! మీరు తిన్న తరువాత తింటాను'—ఆమె కరుకుగా అన్న మాటలకు అతను నివ్వెరపోయాడు.

—సంబాళించుకొని తేలిగ్గా నవ్వటానికి ప్రయత్నం చేస్తూ, 'ఫర్వాలేదు! నా కా పట్టింపులు ఏమీ లేవు! నీవు కల్సి భోజనం చేయవచ్చు' అన్నాడు.

"మీ కా పట్టింపులు లేకపోయినా, మాకున్నాయి! చూస్తూ చూస్తూ మిమ్మల్ని చెడగొట్టలేం" విసురుగా అనేసింది ఆమె మాటలను!

మూర్తి—హృదయం బరువైంది! అతి కష్టం మీద నిభాయించుకొని, "మంచిది" అని, భోజనం చేయటానికి ఉపక్రమించాడు.

ఆరోజు మూర్తి—మనసు మనసులోలేదు మంజుల ప్రవర్తన అతనికి అర్థం గాలేదు. భోజనం దగ్గర జరిగిన సంఘటన అతని హృదయాన్ని బాగా గాయపర్చింది—తనను బుద్ధిపూర్వకంగానే నొప్పించటానికి ఆవిధంగా చేసిందని అతను గ్రహించాడు. క్రితం రోజు గౌరీపతిగారి ప్రక్కనే కూర్చుని అతను భోజనం చేశాడు. మంజుల వడ్డించింది. అటువంటిది ఇవ్వాళ ఎవరిమీద ఆ కోపం? రక రకాలుగా ఆలోచించుకుంటూ, సరిపెట్టుకోటానికి ప్రయత్నించాడు అతను.

ఆ సాయంత్రం గౌరీపతిగారు వచ్చిన తరువాత అందరూ టీ తీసుకుంటున్నప్పుడు కల్సుకున్నాడు.

'మూర్తీ! నేను ఇల్లు వదిలి వచ్చే సమయానికి ఇంకా నీవు పుట్టలేదు. ఎంత కోరుకునేవాణ్ణి....... బుల్లి అల్లుణ్ణి ఎత్తుకోవాలని అప్పట్లో"—ఏదో ప్రస్తావన వచ్చి, ఆయన కండ్లు మూసుకొని, టీ త్రాగుతూ అన్నారు.

మూర్తి వినటం మొదలెట్టాడు. మంజుల ముఖం ప్రక్కకు తిప్పుకుంది!

"మీ అత్తయ్య చనిపోయినప్పుడు అమ్మకు కబురు—చేశాను వచ్చి చూసి—పొమ్మని! అప్పట్లో బరంపురంలో ఉంటుండేవాణ్ణి. అంత దూరం ప్రయాణం చేయలేక రానట్లుంది."

మూర్తి మాట్లాడలేదు.

'ఇష్టంలేక రాలేదు' పెళుసుగా అనేసింది మంజుల!

—మూర్తి ఉలిక్కిపడి, మంజుల వైపు చూశాడు. ఆమె అతనినుంచి చూపులను మరల్చుకుంది.

'తప్పు!' అన్నట్లుగా సైగ చేశారు గౌరీపతి గారు.

బాధగా తలవంచుకున్నాడు మూర్తి.

'బావ ఉంటే, వచ్చేవాడు! తప్పకుండా వచ్చేవాడు!' గొణుక్కున్నట్లుగా గౌరీపతిగారు మాట్లాడారు.

టీ త్రాగుతూ, రెండు నిముషాలు ఎవరూ మాట్లాడలేదు. కొంచెం సేపయిన తరువాత గౌరీ

ప్రియుడు : మనం సరదాగా సాత్ నూరు వెడదామా?

ప్రేయసి : నో నో డార్లింగ్! అవన్నీ సినిమా ప్రేమికులు కే కాని, మనలాంటి వాళ్ళకి కాదు!!

కె. రంగారావు (కాకరపర్రు)

పతిగారే అన్నారు—'అన్నట్లు—మూర్తీ! నీవు హైదరాబాద్‌లోని విశేషాలు చూడలేదు అనుకుంటాను! సాయంత్రం మంజులను తీసుకెళ్ళి అన్నీ చూసి రా!'

మూర్తి మంజులవైపు ఆశగా చూశాడు

"లేదు నాన్నా! ఇవ్వాళ స్నేహితులమంతా కల్సి సినిమా ప్రోగ్రాం వేసుకున్నాం!" అన్నది ఆమె ససేమిరా వీలులేదన్నట్లు!

—గౌరీపతిగారు కొంచెం బలవంతం చేయబోయారు. మూర్తి వారించి—'ఫర్వాలేదు! నన్ను మరీ అమ్మాయిక్రింద జమకట్టకు మామయ్యా! తోడు లేకుండా వెళ్ళగలను' అన్నాడు.

* * *

మూర్తికి ఆర్డర్సు వచ్చాయి! సోఫాలో కూర్చుని ఏదో చదువుకుంటున్న గౌరీపతిగారికి సంతోషంగా ఈ వార్తను చెప్పాడు. మామయ్య చేసిన సహాయానికి కృతజ్ఞతలు గూడా తెల్పుకున్నాడు!

ఉద్యోగం దొరుకుతుందన్న విషయం ఇంతకు మునుపే ధృవపడినప్పటికిని ఆర్డర్సు చూడగానే పట్టలేనంత సంతోషం కల్గింది మూర్తికి. మంజుల తోటలో సాయంత్రం—పూట చల్లగాలికి తిరుగుతుంటే, హుషారుగా మూర్తి అక్కడకు చేరుకున్నాడు.

అతన్ని చూసి మంజుల త్వరగా ఇంటిలోపలికి వెళ్ళటానికి ఉద్యుక్తురాలయింది.

'మంజులా!' అని పిల్చాడు.

ఆమె అప్రయత్నంగా ఆగిపోయింది.

'నాకు ఉద్యోగం దొరికింది' మూర్తి ఉత్సాహంగా చెప్పాడు.

'సంతోషం!' నిర్వికారంగా ఆమె అన్నది.

అతని ఉత్సాహం చప్పగా చల్లారిపోయింది. ఎలా మాట్లాడాలో తెలీక, సిమెంటు బెంచిమీద కూలబడ్డాడు.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచిన తరువాత అన్నాడు 'నాతో మాట్లాడటం ఇష్టం లేనట్లుంది'

'అదేంలేదు.'

'నామీద నీకు అంత కోపం ఎందుకు వచ్చిందో అర్థం గావటంలేదు'

"........."

అతను అమాయకంగా నవ్వి, 'నీతో చాలా విషయాలు మాట్లాడాలి' అన్నాడు.

విసుగ్గా ఆమె అతన్ని చూసింది.

మూర్తి బెదిరాడు. కొంచెంసేపు ఎవరూ మాట్లాడలేదు.

అతనికి ఈ స్తబ్దత ఎబ్బెట్టుగా అన్పించి, 'మీరు ఏదో పని—తొందరలో ఉన్నట్లుంది! వెళ్ళండి' అన్నాడు.

అకస్మాత్తుగా ఏకవచన ప్రయోగం బహువచనం క్రింద మారినందుకు ఆమెకు కొంచెం ఆశ్చర్యం కల్గింది. అయినప్పటికిని దాన్ని కప్పి పుచ్చుకొని, 'మీరెందుకు పిలిచినట్లు?' అన్నది.

'మామయ్య—విషయం అమ్మ సహృదయంతో ఆలోచించలేదు. పొరపాటు జరిగింది'

'అయితే?'

"అయితే........" మధురమూర్తి ఇరకాటంలో పడి, చెప్పదల్చుకున్న మాటలను బయటకు చెప్పలేక కంగారుపడ్డాడు.

'మీకు కోపం వచ్చినట్లుంది!' ధైర్యంచేసి అన్నాడు.

'ఎందుకు?'

'మన కుటుంబ వ్యవహారాలను గురించి' సాఫీగా మాట్లాడుదామనే ప్రయత్నంలో అన్నాడు.

ఆమె బాధగా నిట్టూర్చి, "ఉఁ! మన కుటుంబం చాలు!.........నాన్నను ఇంటి బయటకు నిర్దయగా పంపించేటట్లు చేసినప్పుడు ఉమ్మడి వ్యవహారాలను గురించి ఎవరూ ఆలోచించటానికి సాహసించలేదనుకుంటాను! మమ్మల్ని వెలివేసినట్లు చూస్తున్నప్పుడు వాటి ప్రసక్తి లేదేం?" అన్నది.

"—పొరపాటయింది ! దానికి బాధ్యులయిన వారు చాలా అన్యాయంగా ప్రవర్తించారు."

అతి నెమ్మదిగా చెప్పాడు.

ఆమె ' మన బంధుత్వ బంధాలు ఎప్పుడో తెగిపోయాయి! వాటిని మీ . ....లాభంకోసం ముడి వేయటానికి ప్రయత్నించడం అనవసరపు శ్రమ" అంది. మూర్తి నివ్వెరపోయాడు. సంబాళించుకుని, 'క్షమించండి చనువు ఎక్కువగా తీసుకొని మాట్లాడినందుకు!' అని మాత్రం అనగల్గాడు.

"ఇప్పుడు మీ అందరికీ దూరంగా వచ్చేశాం! మాకు ఎవరితోటీ సంబంధంలేదు. మా మట్టుకు నేము స్వతంత్రులం! మాకు బంధువులు లేరు; ప్రాణంపెట్టే మిత్రులు తప్ప! ... నాన్న కొంచెం పలుకుబడి సంపాదించాడని స్వార్థంతో ఉపయోగించుకోవాలనుకోవటం కేవలం......."

"మంజులగారూ!" మూర్తి అరిచాడు.

"సన్నంత తేలిగ్గా జవ—కట్టకండి' చరచరా తోట బయటకు వెళ్ళిపోయాడు.

* * *

'ఏమయినా సరే నాన్నా! అతను మనమీదున్న అభిమానంతోటి ఏమీ రాలేదు అత్తయ్య-ఉత్తరం చూస్తేనే తెలుస్తున్నది. నిన్ను అంత తేలిగ్గా జవ కట్టడం ఏమీ బాగాలేదు ఆమేమీ పోషించటంలేదుగదా మనను!"

"నీ వింత తొందరపడటం మంచిదిగాదు! మధుర మూర్తి అంత స్వార్ధపరుడు అనుకోను నేను! ఒక వేళ అతను మనం చేసే సహాయానికి కృతఘ్నుడుగా ప్రవర్తించేటట్లయితే—అలాగే కానివ్వు! ఉపకారం చేసినవాడు ఎన్నటికీ చెడిపోడు."

సినిమానుంచి తిరిగి—వచ్చి, అప్రయత్నంగా తండ్రీ కూతుళ్ల సంభాషణను విన్న మూర్తి హృదయంలో అగ్నిపర్వతాలు ప్రబద్దలయాయి! మంజుల తనను ఆవిధంగా అపార్ధం చేసుకున్నందుకు గుండెల్లో నిప్పులు చెరిగినట్లయింది. మెదలకుండా గదిలోకి వెళ్ళి చీకట్లో పరుపుమీద వాలాడు బరువెక్కిన హృదయంతో!

మర్నాడు మధురమూర్తి ప్రయాణమయ్యాడు.

గౌరీపతిగారు, 'ఎందుకింత తొందర' అని అడిగాడు.

—'వెళ్ళాలి! వచ్చి మళ్ళీ డ్యూటీలో జాయిను అవ్వాలి' మూర్తి జవాబిచ్చాడు.

'అమ్మను తీసుకొనిరా! ఎన్ని రోజు లయిందో దాన్ని చూసి' గౌరీపతిగారి మాటలు విన్న మూర్తి నవ్వి, 'అలాగే' అన్నాడు.

# తెలియని విలువలు

—వెళ్ళబోయేముందు మంజులతో 'వెళ్తున్నా' అన్నాడు మూర్తి.

'మంచిది!' అన్నది ముక్తసరిగా.

అతను వెళ్ళిపోయాడు! కంటికి కనబడేంత సేపు అతన్ని చూసి గౌరీపతిగారు లోపలికి నడిచారు.

అతను ఖాళీ చేసిన గదిని యధాప్రకారం సర్దుదామని మంజుల ఆ గదిలోకి వెళ్ళింది. కిటికీ లోంచి విపరీతంగా వీచే పెద్దగాలికి ఏవో కాగితాలు రెపరెపమని ఆమె దృష్టిని ఆకర్షించాయి.

అక్కడొక పెద్ద ఉత్తరం పెట్టి వుంది. అప్రయత్నంగా విప్పింది.

"మంజులగార్కి!

ఈ ఉత్తరాన్ని మీకు వ్రాయటానికి పూనుకోవటం సాహసమే! తప్పకుండా మీ దృష్టిలో ఇది పడుతుందనే గట్టి నమ్మకంతోనే వ్రాస్తున్నాను. ఒకవేళ వీరు చూడకపోతే......పోనీండి!

మామయ్యను చూడకముందే నేను చాలా గొప్ప వ్యక్తిగా రూప కల్పన చేసుకున్నాను. ఆదర్శప్రాయుడుగా అభిప్రాయముంచుకున్నాను! — ఆయన్ను చూసిన తరువాత గూడా ఆ అభిప్రాయాలు చెరిగిపోలేదు. ఆయనమీద గౌరవభావం రెండింతలు పెరిగింది నా దృష్టిలో మామయ్య స్వతంత్రుడు—సాహసి!...... పరిపూర్ణమైన మానవుడు! నేను గర్వపడుతున్నాను, అటువంటి వ్యక్తిని మామయ్యగా నాకు భగవంతుడు ప్రసాదించినందుకు.

మొదటినుంచి మీరు నన్ను పూర్తిగా అపార్ధం చేసుకున్నారు. కేవలం మామయ్య ప్రాపకంతో ఉద్యోగం సంపాదించుకోటానికి వచ్చిన స్వార్ధపరుడిగా, కృతఘ్నుడిగా ఊహించుకున్నారు. మీరు పొరపాటు—పడ్డారు! ఆయన ఆదరాభిమానాలే నాకు చాలు! ఆయన మీదున్న గౌరవం తరగకుండా ఉండటమే నాకు కావల్సింది!

పోతే అమ్మ విషయం—మామయ్య ఎంత అధునాతనుడో, అంత సనాతనురాలు!— వారి మనస్త్వాలు సమాంతర రేఖలు! వాటిని కలపబూనటం సాహసమే అవుతుంది నా దృష్టిలో.

మనుష్యులను సున్నితంగా నొప్పించే విద్య మీకు భలేగా పట్టుబడింది! పరిస్థితులను అర్థం చేసుకుని దూరం ఆలోచించే మనసత్త్వం మీది కానందులకు నాకు బాధగా వుంది......అమ్మకూ, మీకూ చాలా దగ్గర పోలికలున్నాయి!

మామయ్య మీదున్న గౌరవాన్ని నిరూపించుకోటానికి ఉద్యోగాన్ని వదులుకోవటం సాహసమే అవుతుంది! అమ్మ ఆకలితో అలమటించి పోతున్నప్పటికిని, చేజిక్కిన పండును అనుభవానికి రానీయకుండా, చేతులారా చేసుకుంటున్న దురదృష్టవంతుణ్ని. మామయ్య గొప్పతనాన్ని కేవలం ఉద్యోగం ఇప్పించే వ్యక్తిగా విలువకట్టి ఆయన్ను తేలిక చేసుకోను!

—అమ్మను తీసుకొచ్చి చూపిస్తానని దేవుడు లాటి మామయ్యకు అబద్ధం చెప్పాను! క్షమార్పణలు మీ ద్వారా ఆయనకు చెప్పుకుంటున్నాను!

సాధ్యమైనంతవరకూ ఇక హైద్రాబాదు రావటానికి ప్రయత్నించను"

మధురమూర్తి. ★








# బెలూన్‌లో ధ్రువయాత్ర

21-వ పేజీ తరువాయి

నార్త్‌బరోకి జయ్!"

నావ వెళ్ళిపోయిన కొన్ని రోజులదాకా గాలిలేకుండా ఉండిపోయింది. ఇలాగే ఉండిపోతుందా అనుకుంటూ ఉండగా 22 ఆగస్టున వాయు సంచలనం కొంచెం ఏర్పడింది. బెలూన్ ఇటూ అటూ ఊగింది.

ప్రయాణికులు హర్ష ధ్వనులు చేశారు.

"ఉషారుగా ఉండండి అబ్బాయిలూ!" అన్నాడు సంతోషంగా ఫాన్ ఎగ్‌బర్గ్. "ఇదిగో యూరోప్‌కి బయలుదేరి పోతున్నాం!"

ఉదయం ఎనిమిది గంటలకి, అంతా సిద్ధం అయిపోయింది. రూయిటర్ చకచక గాలిలో లేచి వెళ్ళిపోయింది, సెకండుకి పదిమీటర్ల వేగంతో; సైబీరియా దిక్కుగా.

వారి ద్వీపంనుంచి హాగ్‌కి అయిదు వేల, ఎనిమిది వందల, నలభయి అయిదు మైళ్ళకు తక్కువ లేదు కాబట్టి ఇదే వేగంతో ప్రయాణం చేసినట్లయితే పన్నెండున్నర రోజులలో ప్రయాణం పూర్తి కావచ్చునని అంచనా వేశారు. అయినా మహాయాత్ర అంతతక్కువ కాలంలో పూర్తి అవుతుందనే నిర్ణయమూ లేదు!

22 ఆగస్టునాడు ప్రయాణం చేస్తున్నంతసేపూ జపాన్ వైపుగా వెళ్ళిపోతున్న నావలెన్నో కనిపించాయి. మర్నాడు బెలూన్‌క్రింద భూభాగం కనిపించింది; అదే 'సాగాలియన్' ద్వీపం.

ఆరోజంతా తూర్పు సైబీరియా మీదుగా ప్రయాణంచేస్తూ వెళ్ళిపోయారు.

సూర్యాస్తమయంముందు తూర్పు వైపు 'కింగాన్' పర్వతశ్రేణి శిఖరాలు కనిపించాయి. ఇవి చైనా మధ్యభాగంలో ప్రారంభం అయి 'అమూర్' నది తీరంవద్ద ఆగి పోతాయి.

మరుసటిదినం, అంటే 24 ఆగస్టున మంచూరియా చేరుకున్నారు.

అదేరోజున రూయిటర్ ఎగిరి వెడుతున్న ఎత్తులో మేఘాలు దట్టంగా అలుముకున్నాయి. క్రింద భూమి అసలు కనిపించకపోలేదు కాని ఏ రకమయిన వివరాలూ తెలియడంలేదు. ద్వీపం వదిలిన తర్వాత ఇక్కట్టు రావడం ఇదే మొదటిసారి.

అగస్టు 26: ఆకాశమంతా పరికిస్తున్న పాల్ తూర్పు దిక్కుగా కొన్ని మంచు పర్వతాలు కనిపిస్తున్నా యన్నాడు.

దూరదర్శినితో చూశారు.

"అవే బెయికాల్ (baikal) సరస్సు వెంబడే ఉండే పర్వతాలు" అన్నాడు మారిస్.

త్వరలోనే కొండలను సమీపించారు. గంటలో వాటిమీద నుంచి దాటుకుంటూ వెళ్లిపోతున్నారు. అవతల కనుచూపుమేరకి అందని జలరాశి కనిపించింది. అదే బెయికాల్ సరస్సు.

ప్రొద్దున పదిగంటలకి ఇర్కూట్స్క్ (Irkoutsek) నగరం కనిపించింది. ఇది తూర్పు సైబీరియా రాజధాని. గవర్నర్ జనరల్ నివాస స్థానం ఈ ఊరిలోనే.

మిట్టమధ్యాహ్నం అయిందనగా ఫాన్ఎగ్బర్గ్, బెలూన్ కొద్దిగా క్రిందికి దింపాలన్నాడు. నేలను సమీపించినకొద్దీ వాయువేగం తగ్గుతుందని అతనిఊహ. అందరూ సరేనన్నారు. రూయిటర్ పటవాలుగా ప్రయాణం చెయ్యటం మొదలుపెట్టింది!

ఫ్రెడరిక్ ఊహా సరిఅయినదేనని తేలింది. భూమిదగ్గరగా పోయిన కొద్దీ గాలి విసురు తగ్గింది. ఎనిమిది వందల మీటర్ల ఎత్తుగా ఉండగా బెలూన్ వేగం సెకండుకి మూడు నాలుగు మీటర్లకు తగ్గిపోయింది.

"మనమింక మజిలీ వేసినా వెయ్యొచ్చు!" అన్నాడు ఫాన్ఎగ్బర్గ్ తృప్తిగా. "ఏదీ లంగర్ దింపు, పాల్!"

బెలూన్ ఇంకా దిగిపోయింది. ఇక నేల అట్టే దూరంలో లేదనగా బాల్కనీ మీద నుంచుని పరిసరాలు

తండ్రి:-ఏమిరా అబ్బాయీ! నీకన్నా ఆ పక్కింటి అమ్మాయికి మార్కులు ఎక్కువ వచ్చే యేమిరా!

కొడుకు:-మరి నా నోట్సు లన్నీ ఆ అమ్మాయి తీసుకుంది నాన్నా.

రావు (విజయవాడ)

పరిశీలిస్తున్న పాల్, మారిస్లకు ఒక వింత దృశ్యం కనిపించింది. వారి ఆశ్చర్యానికి అంతులేదు. క్రింద పచ్చికబయలు (Steppe) మీద ఒక చిన్నఅమ్మాయి పడిపోయి ఉంది.

రూయిటర్ సుమారు నాలుగయిదు వందల మీటర్ల అవతల వెళ్ళి దిగింది.

ఆ అమ్మాయి చనిపోయి పడి ఉంటుందనుకున్న మారిస్ లంగరు తాడు పట్టుకుని, బాల్కనీ మీద నుంచి ఉరికి రెండు నిముషాలలో బెలూన్ని కట్టేశాడు.

ఆపైన కొంతసేపటికి మారిస్ ఆ అమ్మాయిని బెలూన్ వద్దకు ఎత్తుకుని తీసుకువచ్చాడు.

మారిస్ తీసుకొచ్చిన పిల్లకి పదమూడు పధ్నాలుగు సంవత్సరాలు మించినట్లులేవు. ఆమెదుస్తులు చూస్తే బీద తరగతి వారివిలాగ ఉన్నాయి కాని మనిషి మాత్రం ఒకప్పుడు ధనిక వర్గానికి చెందినట్లుంది.

ముందు ఆమెచేత కొంత వైన్ తాగించారు. దానితో ఆమె కొంత కోలుకుంది. మరికొంచెం తాగించారు. పాలిపోయిన ఆమె బుగ్గలకి వెంటనే రంగువచ్చింది.

పచ్చికబయలు మధ్య పడిపోయి కనిపించిన ఈ అమ్మాయి ఎవరు? చుట్టుపట్ల ఎక్కడా ఏ విధమయిన బండి కాని మనుష్యుల నివాస స్థానాలు కాని మన ప్రయాణికులకు కనిపించలేదు.

ఆమె పడిపోయిఉన్నచోట మారిస్కి ఒక చిన్నమూట దొరికింది. దాన్నిండా కొన్ని నాణెములున్నాయి. వాటినిబట్టి ఆమె ధనిక వర్గానికి చెందినట్లు ఊహించటానికి వీలులేదు. ఈ కాసులు కాక ఒక చిన్నపెట్టెఉంది. ముందు సందేహించాడు కాని, గుర్తులేమయినా దొరుకుతాయేమో నని పాల్ పెట్టె తెరిచాడు.

చిరిగిపోయిన దుస్తులు కొన్ని, రెండు పుస్తకాలు కనిపించాయి, వాటిలో ఒకటి రష్యన్ నిఘంటువు, రెండవది ఏదో చరిత్ర. పుస్తకాల మీద 'ఇవా సోమోలెఫ్' అని వ్రాసిఉంది. ఇది ఆమె పేరే అయి ఉండాలి.

ఇవా కళ్లు తెరిచింది. ఫ్రెడరిక్ ఆమెను నెమ్మదిగా ఒక మెత్తటి సీటుమీద కూర్చోపెట్టాడు. తర్వాత మృదువుగా ఆమెచేతిని పట్టుకుని రష్యన్ భాషలో అడిగాడు :

"ఇక్కడికి కెలా వచ్చావ్ ఇవా?"

(ఇంకా ఉంది)

# తామరకొలను

13—వ భాగం

శేషగిరి, ఆశా భోజనానికి వంట గదిలోకి వెళ్ళారు. కాస్సేపటిలో రమేశుడిని వెతుక్కుంటూ వచ్చింది రత్న. రమేశ్ చీకట్లో నిల్చోవటం చూసి, బాల్కనీ లైటు స్విచ్ వేయటానికి చెయ్యి చాచింది.

ఆ చేతిని తన చేతితో అందుకుని రమేశ్:

"రత్నా .... .... " అన్నాడు.

"ఏమిటి ?"

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా ?"

"ఇదేం ప్రశ్న ? వాళ్ళిద్దరూ అన్నం తింటున్నారు. మీరూ రండి."

"నేను అడిగినదానికి బదులుచెపితేగానిరాను."

రత్న కొంటెగా "ప్రేమించటం లేదని చెపితేనో ?" అంది.

"ఈ బాల్కనీ నుండి కిందికి దూకేస్తాను."

రత్న పకొనంగా అతని చేతిని నొక్కి, లోపలకు వెళ్ళింది. రమేశ్ సంతృప్తి చెందాడు.

మర్నాడు ఉదయం తను విహార్‌లేక్‌కి రాలేనని చెప్పేశాడు శేషగిరి.

"మీరు వెళ్ళిరండి. నేను ఇంట్లోనే ఉంటాను" అని ఖచ్చితంగా చెప్పేశాడతడు.

ఆఖరికి రమేశ్, రత్న, ఆశా ఇంటినుండి బయల్దేరి, నళిని ఇంటికి వెళ్ళారు. రమేశుడిని నళిని తల్లిదండ్రులకు పరిచయము చేసింది రత్న.

నళిని చూపరులకు ముద్దు గొలిపేలా అలంకరించుకొంది. జరీ—పువ్వుల తెల్ల—సిల్కుచీరలో నున్న నళినిపైనుండి తన చూపును మరల్చుకోలేకపోయింది రత్న.

ఆశా, నళిని కాళ్ళకు పెనవేసుకుని 'అక్కయ్యా .... నువ్వెంత బాగున్నావ్ ! నీ జడ ఎంత పొడుగో, నాకు జడే లేదు. ....' అమ్మా ! అక్కయ్యెంత బావుందో చూడు .... నేను అంత బాగా లేను కదూ ..... " అంది.

"అవునమ్మా, నువ్వు నాలాగున్నావు" అంది రత్న.

రమేశ్ నళినిలను తన మనస్సులో పక్కపక్కగా నిలబెట్టి చూసి రత్న

"ఎంత అందమైన జంట" అనుకుంది.

నళిని ఇంటినుండి బయల్దేరేసరికి తొమ్మిది గంటలయింది.

ఆరోజు ఆదివారం కావటంవల్ల విహార్‌లేక్ అంతా జనసమ్మర్దంతో నిండిపోయింది. ఆ పందడినీ, అందమైన తోటను చూడగానే, ఎగిరి గంతులు వేసింది ఆశా.

అందర్నీ వదిలి ఉత్సాహంతో పరుగులు తీస్తున్న కూతుర్ని వెంబడించే సాకుతో రమేశ్ నళినీలను వదిలి ముందుకు వెళ్ళింది రత్న.

కాని, ఆశా తల్లి—చేతికి దొరికితేనా ?

ఆశా భూతాకారపు బొమ్మల పోటిలో ప్రవేశించి ఆటలాడింది. తల్లి—చేతికి అందకుండా ఏడిపించింది.

రమేశ్ నళినితో కలిసి వస్తున్నా, అతడి కళ్ళు కూతురితో ఆడుకుంటున్న రత్న మీదనే ఉన్నాయి. నళిని మాటలమీద దృష్టే లేదతనికి. రత్న ఎక్కడైన మనుష్యుల గుంపులో కనుమరుగయినపుడు అతడి కళ్ళు ఆ సమీపంలోనే రత్నకోసం వెతుకుతున్నాయి.

కూతురి ఆటపాటల్లో వైమరచిన రత్నను చూసి అసూయ కలిగింది రమేశుడికి.

రత్న ఎంతమందిని ప్రేమించగలదు ? తన కూతుర్ని అంతగా ప్రేమించే రత్నకు తనమీద కూడా ప్రేమ ఉండటం సాధ్యమా ?

'ఏమయినా సరే. ఈరోజు ఈ సంగతి తప్ప కుండా తేల్చేయాలి.' అనుకున్నాడు రమేశ్.

"రమేశ్! అటు చూడండి. నీళ్లలో చెట్ల, మబ్బుల ప్రతిబింబం ఎంత బావుందో ...."

"సరిగ్గా వినిపించుకోని రమేశ్ "ఏమిటి? ఎక్కడా ?" అని కంగారుపడ్డాడు.

ఇహ రమేశుడిని మాట్లాడించాలనే ఆశ వదులు కుంది నళిని. తనూ రమేశుడితోబాటు రత్న, ఆశలను వెతకసాగింది.

చెట్టు—నీడలో గడ్డిమీద కూర్చున్న రత్నను చూడగానే:

"ఎక్కడికి వెళ్లారు మీరు ? వెతకలేక చచ్చాం." అంది.

"నిజంగా ?"

"ఊఁ. కావాలంటే వీరిని అడుగు"—అంటూ రమేశుడివైపు చూసింది నళిని. రమేశ్ "నిజంగా ?" అంటున్న రత్న మోహక భంగిమను చూస్తూ నిల్చున్నాడు.

నళిని మొహం తెల్లగా పాలిపోయింది. ఆమె మొహంలోని వెలుగు, మానె అయిపోగానే ఆరి పోయే దీపంలా, ఆరిపోయింది.

మరుక్షణంలోనే తేరుకుంది నళిని. మామూలు గానే నవ్వుతూ వెళ్లి, రత్న పక్కన కూర్చుంది.

పొద్దెక్కుతున్నకొద్దీ వేడి ఎక్కువ కాసాగింది. సోడా అమ్మేవాళ్ల వ్యాపారం బాగా సాగుతోంది.

"అమ్మా! నాకు ఐస్‌క్రీమ్."

"రా; ఐస్‌క్రీమ్ ఇప్పిస్తాను" అంటూ లేచింది రత్న.

నళిని "నువ్వుండు రత్నా! నేను ఇప్పిస్తాను" అని ఆశ—చెయ్యి పట్టుకుని బయల్దేరింది.

రమేశ్—రత్న ఇద్దరే మిగిలారు.

రత్నే మాటలు ప్రారంభించింది:

"నళిని చాలా మంచిపిల్ల కదూ ?"

"అవును."

"రూపం, విద్య, బుద్ధి అన్నీ ఉన్నా, గర్వంలేదు."

"నిజం."

"ఆమెను చేపట్టే వరుడు అదృష్టవంతుడు."

"అవును."

రత్న అర్థగర్భితంగా రమేశుడివైపు చూసింది. రమేశ్ ఏమీ తెలినట్టే నటించాడు.

"రత్నా! మీకు ఆశంటే చాలా ప్రేమకదూ?" రత్న ఆశ్చర్యంతో తలెత్తి "అదేం ప్రశ్న!"అంది.

"చెప్పండి."

"ఏ తల్లి కుండదు తన పిల్లమీద ప్రేమ ? దీనిలో అడగటానికేముంది ?"

"కాని, మనిషి హృదయం ఎంతో చిన్నది. ఒకే సారి ఎంతమందిని ప్రేమించగలదు ?"

"హృదయపు ఆకారం చిన్నది. కాని అందులోని భావనలు విశ్వాన్నంతా ఆవరించగలవు. ప్రేమకు మరో పేరే దేవుడు అనటం అబద్ధం కాదు. దేవుడు సర్వశక్తి సంపన్నుడు, సర్వాంతర్యామి, సర్వ వ్యాపి అని వినే ఉన్నారుగా."

"రత్నా! మీరు ఆశను ఎంతగా ప్రేమిస్తు న్నారు ?"

"ఒక తల్లి తన పిల్లను ఎంతగా ప్రేమించ గలదో అంతగానూ ప్రేమిస్తున్నాను."

"రేపు మీకు నలుగురు పిల్లలు పుట్టినా, ఆశను ప్రేమించినట్టే వాళ్లనూ ప్రేమించగలరా ?"

"ఏం ప్రశ్న అడుగుతున్నారు మీరు. నలుగురు పిల్లల తండ్రయ్యాక మిమ్మల్ని ఇదే ప్రశ్న అడుగు తాను. మీ రప్పుడేం జవాబు ఇస్తారో, నేనూ అదే ఇప్పుడు ఇవ్వగలిగేది."

రమేశ్ గడ్డి కొసను పంటితో కొరుకుతూ:

"నేను తండ్రిని కాబోను" అన్నాడు.

"అంటే ?"

"నేను పెళ్లి చేసుకోను.

రత్న నవ్వి "పెళ్లి కాకముందు యువతీ యువకు లందరూ ఇదే మాట అంటారు" అంది.

"ఖచ్చితంగా చెపుతున్నాను నేను."

"కారణం తెలుసుకోవచ్చా ?"

"ఆ. నిరాశే కారణం."

"ఎలాంటి నిరాశ."

"నేను అపురూపమైన రూపవతిని పెళ్లాడా లని కోరుకునేవాడిని. రూపం కోసం అన్వేషిస్తున్న నా మనసు కెవరూ నచ్చలా ...."

రత్న మధ్యలో అందుకుని "మీకు నచ్చే రూప సిని నేను తేగలను" అంది.

"కావచ్చు కాని, ఇపుడు రూపసిని మెచ్చుకునే మనఃస్థితిలో లేను నేను."

---

విలేఖరి: మీరు చనిపోయా రని చదివానే ?

ప్రఖ్యాత రచయిత: అది నీ ముందు జన్మలో రాగల కల ఐఉంటుంది.

ఆలంష (పొన్నూర్)

---

కారణం అడిగే ధైర్యం రాలేదు రత్నకు. అతడి దృష్టిని ఎదురించలేక తల వంచుకుని కూర్చు న్నది.

"నాకు నచ్చిన యువతికి....పెళ్లయిపోయింది" మెల్లిగా అన్నాడు రమేశ్.

ఆమె ఎవరని అడగటానికి ప్రయత్నించి, చివ రికి మౌనమే మంచి దనుకుంది రత్న.

"రత్నా! ఇపుడు నేనేం చెయ్యాలో చెప్పండి" రమేశ్ ఆమెనే అడిగాడు.

"ప్రేమ గుడ్డిది. నిజం; కాని, ప్రేమకు కూడా కొంచెం విచక్షణా జ్ఞానం ఉండాలి."

"ఇపుడేం చేయను ?"

"ఏమీ చేయకండి. ఆమెను మరిచిపోయి ఇంకో అందగత్తెను పెళ్లాడి సుఖంగా ఉండండి."

"రత్నా! మీరు మనఃపూర్వకంగా ఈ సలహా ఇస్తున్నారా ?"

రత్న తలెత్తి అతడివైపు చూసింది. ఆమె కళ్లలో బాధ స్పష్టంగా కనిపిస్తోంది. అతడి మీది అభిమానం, వృథా ఆమె మొహంలో గూడు కట్టుకున్నాయి.

"నా ఆత్మను హింసించకండి రమేశ్! నాకు అంత శక్తి లేదు."

"మనఃపూర్వకంగానే ఇస్తున్నారా ఈ సలహా ?"

"అవును; పెళ్లి ఒకటే మీరు పొతదాన్నంతా మరిచి, జీవించటానికి సాయపడుతుంది. మీ సంపా దనమూ, వృత్తి, వీటి సహాయంతో అన్నీ మరిచి పోగలరు."

"నాకు మీ మాటలమీద నమ్మకం కలగటం లేదు."

"నా మాట నమ్మండి. మొదట కొన్ని రోజులు పాతవాటిని మరిచిపోలేక పోవచ్చు. కాని, క్రమేణా అన్నీ సరిపోతాయి. ఒక స్త్రీ కాని, పురుషుడు కాని ఒకర్నొకరు పోగొట్టుకుని జీవితమంతా ఏడవ దగింది ఏమీలేదు. ఎవరికీ అంతటి విలువ నివ్వ రాదు."

"నోటితో చెప్పటం సులువే. ఆచరణలో పెట్ట టమే కష్టం."

"కష్ట మంతగా ఏం ఉండదు. పోనుపోను అన్నీ మీకే తెలుస్తాయి."

రమేశుడికి దూరంలో నళిని, ఆశా రావటం కనిపించింది. వెంటనే తను అడగా లనుకున్న ప్రశ్న గుర్తుకు వచ్చింది.

"రత్నా! నే నొకటి అడుగుతాను, చెప్పాలి" అన్నాడు.

"ఏమిటది ?"

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా ?"

రత్న చిన్నగా నవ్వి "కొన్ని ప్రశ్నలు అడగ రాదు. వాటికి జవాబు దొరకదు" అంది.

"కాదు చెప్పండి."

"మీ కేమనిపిస్తోంది ?"

"మన మిద్దరమే ఉన్నప్పుడు మీరు నన్ను ప్రేమిస్తున్నారనే అనిపిస్తుంది. కాని, మీరు ఆశతో కలిసి ఆనందంగా ఆడుకుంటున్నప్పుడు ఆశను ప్రేమించినంతగా నన్ను ప్రేమించటం లేదని పిస్తుంది. మీరు నిజం చెప్పండి."

"నిజం తెలుసుకుని ఏం చేద్దామని ?" కొంటెగా అడిగింది రత్న.

"నన్ను బాధపెట్టక చెబుదురూ" అన్నాడు రమేశ్.

రత్న చుట్టూ చూసి మెల్లిగా "వీలయితే మిమ్మల్ని నా కంఠహారంగా మార్చి మెళ్లో వేసు కునేదాన్ని" అంది.

"కంఠహారంగానా ? ఎందుకూ ?"

"హృదయానికి దగ్గరగా ఉంటుందని."

రమేశుడి ఆనందానికి అంతులేదు. నళిని, ఆశా దగ్గరగా లేకపోతే తన సంతోషాన్ని ఏవిధంగా చూపేవాడో ?

మోకాలిమీద తల ఆన్చి పచ్చగడ్డిమీద కూర్చుంది రత్న. పెద్ద ముడిమీద మల్లెపూల దండ అమర్చుకుంది. ముడి మధ్య కెంపుల బిళ్ల మెరుస్తోంది.

వెనుకనుండి చెక్కిన ప్రతిమలా ఉన్న రత్నను చూస్తూ, నళిని నిదానంగా నడిచి వచ్చింది. ఆశా పరుగెట్టుకుంటూ వచ్చి తల్లి ఒళ్లో పడి:

"అమ్మా! ఐస్‌క్రీమ్ ఎంత బావుందో" అంది.

"ఇంతసేపయిందేం ?" నళిని వైపు తిరిగి అడి గింది రత్న.

"నళిని అక్కయ్య నన్ను నీళ్ల దగ్గరకు తీసి కెళ్లింది. అమ్మదగ్గరకు వెడదాం అంటూ౦టే

లివకుండా ఎక్కడెక్కడికో తీసికెళ్ళింది...."

రత్న గుండె దడదడ లాడింది. గబుక్కున నళిని—మొహం చూడా లనిపించింది కాని, తలెత్తి చూసే ధైర్యం రలేదు. కాసేపయ్యాక ఏదో మాట్లాడుతూ నళినివైపు చూసింది.

అందమైన ఆ మొహంమీద రాసిన కథ స్పష్టంగా కనిపించింది రత్నకు. నల్లటి ఉంగరాల జుత్తు ఆవరించిఉన్న ఆ ముద్దు మొహంలో నిరాశ చోటు చేసుకుంది.

ఇలాంటి పిల్లవైపు తలెత్తి చూడలేని రమేశ్ ఎంతటి మూర్ఖుడు!

రమేశుడికి బాగా బుద్ధిచెప్పాల అనుకుంది రత్న.

ఒక విధమైన నిరాశ, అసంతృప్తి, వ్యధలతోనే ముగ్గురూ ఇంటిదారి పట్టారు. ఐస్ క్యాండి తింటున్న ఆశా మాత్రం ఆనందంగానే ఉంది

దోవలో ఎవరూ ఎక్కువగా మాట్లాడలేదు.

రమేశుడివైపు ఆకర్షించబడిన నళినికి అతడి దృష్టి వేరే చోట్లో ఉందని తెలిసినపుడు, తన అందం, చాతుర్యం అంతా వ్యర్థ మనిపించి నిరాశ చెందింది.

నళిని—పూస కారణం గ్రహించి రత్న నొచ్చుకుంది. నళిని తన ఇంటివైపు తిరిగినపుడు,

"సాయంత్రం మెట్రో వెడదాం రా. మంచి పిక్చరే వచ్చింది" అంది.

"లేదు రత్నా! నేను రాలేను. నా స్నేహితురాలింటికి వస్తానని మాటిచ్చాను. క్షమించు" అని రమేశుడివైపు తిరిగి

"వస్తాను" అని చేతులు జోడించింది.

నళిని వెళ్ళిపోగానే, రత్న రమేశుడివైపు తిరిగి:

"నళిని అదోమాదిరిగా ఉంది" అంది.

"అలాగా. నేను గమనించలేదు"

"మీరు ఆమె నేమీ నొప్పించలేదు కదూ ?"

"ఛా. నేనామెతో మాట్లాడితే కద" అని తనను తాను సమర్థించుకున్నాడు రమేశ్.

నళినికి అంతకన్నా మరో అవమానం ఏముంది?

"మీ రెందుకు మాట్లాడలేదు ? మాట్లాడితే ముత్యాలు రాలుతాయనా ? మీరు మాట్లాడించలేదనే ఆ అమ్మాయి చిన్నబుచ్చుకుంది. పాపం ! ఎందుకలా చేశారు మీరు ?"

రమేశ్ అపరాధిలా తల వంచుకుని:

"ఏమని మాట్లాడించాలో నాకు తెలిలేదు" అన్నాడు.

"నా దగ్గర గంటలకొద్దీ మాట్లాడుతారు కదా. నళినితో మాట్లాడటాని కేమీ తోచలేదా ?"

"మీరు నళిని కాదు; రత్న."

"ఎవరైతే నేం! మీ రామెను మాట్లాడించకుండా చాలా తప్పుపని చేశారు."

"ఏమని మాట్లాడించాలి ?"

"నువ్వు చాలా అందంగా ఉన్నావు అని చెప్పాల్సింది."

"ఇది మరీ బావుంది. అందంగా ఉన్నవాళ్లను అందంగా ఉన్నా వనటంలో విశేషం ఏముంది ? అన్నంతిని, కంచం కడుగుతున్నవారిని 'భోంచేశారా?' అని అడిగినట్టు ఉంటుంది."

"పొండి. నేను మీతో మాట్లాడను" అంది రత్న కోపంగా.

తమిద్దరి మధ్యా ఆశ ఉండకపోయినట్టయితే... అనుకున్నాడు రమేశ్.

తలుపుకు వేసిన తాళాన్ని చూసి రత్న కనుబొమలు ముడివడ్డాయి.

"ఆశా! దేశాయిగారింటికి వెళ్లి తాళంచెవి తీసుకురా" అంది రత్న.

ఆశ వెళ్లగానే రమేశ్:

"కోపం చేసుకోకండి. నళినిని ఏమని పలకరించాలో నాకు తెలియలేదు. ఈసారికి క్షమించండి" అన్నాడు.

పశ్చాత్తాపంతో నిండిన అతని మొహాన్ని చూసి రత్న కోపమంతా కరిగిపోయింది. కాని, దాన్ని బయటపడనీయకుండా మౌనంగానే నిల్చుంది.

"సాయంత్రం మెట్రో వెడదామా ?"

"ఊహుం. నేను రాను."

"నే నింకా ఆ థియేటర్ చూడలేదు."

"వెళ్లి చూసి రండి."

"ఒక్కడినే వెళ్లటాని కిష్టంలేదు."

"అయితే నళినిని పిలవండి."

రమేశ్ ఉత్సాహంతో "అలాగే. దారిలో నళినిని కూడా తీసుకునే వెడదాం" అన్నాడు.

ఆశ తాళంచెవి తీసుకుని వచ్చింది. రత్న తాళం తీసి ఇంట్లోకి అడుగు పెట్టింది.

శేషగిరి చిన్న చీటీ రాసిపెట్టాడు టేబుల్‌మీద.

"నాకోసం భోజనానికి కాచుకోకండి."

రత్న—మొహం వాడిపోయింది.

"ఏం జరిగింది ?" అన్నాడు రమేశ్.

"ఏమీలేదు. ముందు మీరు కాళ్లు కడుక్కోండి."

"డాక్టర్ని రానివ్వండి."

"కాచుకోవద్దని రాశారు."

భోజనా లయ్యేసరికి రత్న మనస్సు కాస్త కుదుట బడింది. రత్న ప్రసన్నగా ఉండటం చూసి రమేశ్,

"సాయంత్రం మెట్రో వెడదాం" అన్నాడు.

"మీరే నళినితో చెప్పండి" అని రిసీవర్ రమేశుడి చేతి కిచ్చింది. ఇష్టంలేకపోయినా ఫోన్ చేశాడు రమేశ్.

"సాయంత్రం నాలుగింటికి వస్తాం. మెట్రోకి వెడదాం."

ఒక క్షణం ఊరుకుని "క్షమించండి. నేను రాలేను." అని ఫోన్ పెట్టేసింది నళిని.

రమేశ్ రెండుమార్లు హలో అని జవాబు రాకపోయేసరికి ఊరుకున్నాడు.

"ఏమంది?" కుతూహలంగా అడిగింది రత్న.

"రాదట."

"అయితే నేనూ రాను."

"నాకు మెట్రో చూపించరా ?"

"మీకు నేను చూపించట మేమిటి ? మీరే వెళ్లి చూసిరండి."

రమేశ్‌కి ఆమెతో బాగా దెబ్బలాడా లనిపించింది. కాని, ఆశ దగ్గర్లోనే ఉండటంతో ఊరుకోవాల్సివచ్చింది.

నాలుగ్గంటలవుతూంటే, రమేశ్ నిలవలేకపోయాడు.

శారద : అవునోయ్! ప్రేమ లేఖలు రాస్తున్నావుట? ఎవరికీ?

నీరద : ఇంకా ఎవరికీ లేదు ప్రాక్టీసుకే రాస్తున్న.

అప్పాజీ (విజయవాడ)

ఆఖరికి స్థిరంగా, మౌనంగా కూర్చున్న రత్న దగ్గరకు వెళ్లి:

"వెడదమా ?" అన్నాడు.

"ఎక్కడికి ?"

"మెట్రో."

"క్షమించండి. నేను రాలేను."

"రత్నా! ఎందుకు నన్నిలా ఏడిపిస్తున్నారు?"

"ఈరోజు నేను రాలేను. ...." అంటూండగానే ఫోన్ మ్రోగింది. శేషగిరి ఫోన్ చేశాడు.

"స్నేహితులతో సినిమాకు వెడుతున్నాను. రాత్రి రావటం ఆలస్యమవుతుంది. నాకోసం కాచుక్కూర్చోకండి."

రత్న రిసీవర్ క్రింద పెట్టి రమేశుడివైపు తిరిగి:

"వస్తాను" అంది.

ఆనందంతో రమేశుడి మొహం వికసించింది.

రత్న ఆశకు గుడ్డలు మార్చి తనూ అలంకారం చేసుకుంది. ఇంటికి తాళంవేసి తాళంచెవి ఆశచేతికిచ్చి:

"మంజూ తల్లికి ఇచ్చేసిరా" అంది.

"ఉన్నట్టుండి మనస్సు మార్చుకున్నారేం."

"కారణ మేమీలేదు. వెడదాం రండి."

"నళిని—వాళ్లింటికి వెళ్లి పిలుద్దామా ?"

"వద్దు" అంది రత్న ముక్తసరిగా.

మెట్రోలాంటి భవ్యమైన థియేటరును అంతవరకూ చూసి ఎరుగడు రమేశ్. అలాంటి థియేటరులో కూర్చుని ఎంత చెత్త—పిక్చరయినా చూడ వచ్చు అనిపించింది రమేశుడికి

క్రింద పరచిన రత్నకంబళి, కుషన్ కుర్చీలు, అద్దాలు, హితమైన వాతావరణం, అతడిని వేరే లోకంలోకి తీసుకువెళ్లాయి.

కుర్చీలో కూర్చుని రమేశ్ రత్నతో:

"బొంబాయిలో చూడదగినవి మూడున్నాయి" అన్నాడు.

"ఏవేవి ?"

"సముద్రం, మెట్రో, మీరు."

రత్న—కళ్ళు చెమర్చాయి. రుద్ధకంఠంతో:

"రమేశ్! నేను మామూలు స్త్రీని. నన్నెందుకింత ఉన్నతస్థాయిలో కూర్చోపెడతారు ? మీరిలా మాట్లాడితే నాకు బాధకలుగుతుంది" అంది.

రమేశ్ కాస్సేపు ఊరుకుని.

"రత్నా! నన్నెపుడు ఊరికి పంపిస్తారు ?" అన్నాడు.

రత్న అదిరిపడింది. రమేశ్ తమ ఇంటికి అతిథిగా వచ్చినవాడు. కొద్దిరోజులుండి వెళ్ళిపోతాడు అనే విషయం అప్పుడే గుర్తుకొచ్చిందామెకు.

తరువాత.... తరువాత.... తను.... ఎలా ?

"ఊరికి వెళ్ళే మాటతో నన్ను భయపెట్టకండి రమేశ్."

"అయితే ఇక్కడే ఉండిపొమ్మన్నారా ?"

"ఊఁ మీరు వెళ్ళిపోతే నాకేం తోచదు."

"ఏం ?"

"మీరు వెళ్ళిపోతే తరువాత ఇంత ప్రేమగా, స్నేహంగా నన్నెవరు చూస్తారు ?"

రమేశ్ చీకట్లో చటుక్కున ఆమె చేతిని పట్టుకుని:

"రత్నా! ఇపుడు నన్నేం చేయమంటారో చెప్పండి" అన్నాడు. అలా అంటున్నట్టుగానే అతడి ధ్వని భారమైంది. ఉద్వేగంతో వేగంగా ఊపిరి వదులుతున్నాడు.

"అంటే ?"

"నాకు ఏం చెయ్యటానికి తోచటంలేదు.. మీరు ఎలా చెబితే అలా చేస్తాను. నేనిక్కడికి వచ్చిన ఉద్దేశమే వేరు. దుఃఖపు వలనుండి తప్పించుకుందామని ఇక్కడికి పారిపోయి వచ్చాను. కాని ఇక్కడ ఇంకో వలలో చిక్కుకున్నాను. రత్నా.... నేనేం చేయను ?"

దారితప్పిన పసిపిల్లాడిలా, అసహాయుడై 'ఏం చేయను' అని తన్నడుగుతున్న రమేశుడిని తన హృదయానికి హత్తుకోవా లనిపించింది రత్నకు.

థియేటరులో ఉన్నది మనకవెల్తారే అయినా, చుట్టూ ఉన్న మనుష్యులను చూసి తన కోర్కెను లోలోపలే అణుచుకుంది రత్న.

"ఏం చేయను రత్నా ?"

"నేనూ మీలాగే అసహాయురాలిని రమేశ్. మీ రీ ఊరికి అసలెందుకొచ్చారు ? మీరు రాక మునుపు నేను నిశ్చింతగా ఉండేదాన్ని."

"కాని, సంతోషంగా ఉండేవారా ?"

"అవన్నీ అడగరాని ప్రశ్నలు.... మీ రెందుకొచ్చారు ?"

"తరువాత చెపుతాను నే నెందు కొచ్చానో...."

ఇద్దరూ సినిమా చూడటంలో మునిగిపోయారు.

(పశేషం)

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

వేశంలో మాట్లాడుతూ, ఇటీవల శ్రీ పాటిల్ చక్కెర పరిశ్రమకు సంబంధించిన—ముఖ్యంగా ఎగుమతికి సంబంధించిన సాధక బాధకాలు గూర్చి ప్రస్తావించారు. ఆ ప్రసంగంలో ఆయన ఇలా అన్నారు:

"ఎగుమతుల విషయంలో పరిశ్రమ ఉన్న ప్రాథమిక స్థితిని ఇదివరకు వివరించాను. ఈ విషయంలో మన లక్ష్య సాధన మనేది గత రెండేళ్ళుగా, పరిశ్రమ ఎదుర్కొంటున్న కష్టాలతో పుట్టింది. కాని, నిరంతర కృషివల్ల మీ సంస్థ, స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ సహాయంవల్ల చక్కెర పరిశ్రమకు అంతర్జాతీయ మార్కెట్టు విషయంలో నిలదొక్కుకుంది. మన కక్కరలేని చక్కెర మిగుళ్ళను వదిలించుకోవటం ఇప్పుడు పెద్ద కష్టమైన పనేం కాదు. పైగా, ఒక క్రమపద్ధతిన ఎగుమతి చెయ్యటం అవసరం కూడా. ఎందుకంటే ఇది విదేశీ ద్రవ్య మారకాన్ని ఆర్జించే సాధనంగా గుర్తించటం జరిగింది. ఈ విషయంలో చాలా అభివృద్ధి సాధించాం కూడా. మీ అందరి సహాయం ఉంటే 2,50,000 టన్నుల పంచదార తయారు చేయటమే గాక, దాన్ని జపాన్, అమెరికా, తదితర దేశాలకు ఎగుమతి చేసేందుకు కూడా వీలవుతుంది. పరిశుద్ధమైన పంచదార వర్తకం మీదనే ఎక్కువ మోజు పెరుగుతోంది. అందువల్ల మనం కూడా ఇంతవరకు అనుసరిస్తున్న పథకాలను, పద్ధతిని కొద్దిగా మార్చుకోవాల్సిఉంటుంది. మన ప్రభుత్వం ఈ విషయాన్ని తీవ్రంగా పరిశీలిస్తున్నది. త్వరలోనే మీ అందరి సహకారంతో ప్రస్తుత ధరల రీతి కనుగుణమైన చక్కెర తయారు చేసేందుకు చేయాల్సిన ప్రయత్నాలు ఆలోచించేందుకు ఓ పథకాన్ని రూపొందిస్తుందని హామీ ఇస్తున్నాను."

ధరలకు సంబంధించినంతవరకు వ్యవసాయోత్పత్తులు ఉత్పత్తిదార్లకు అనుకూలంగా ఉండటమే శ్రీ పాటిల్‌కు ఇష్టం. ఇక పంచదార విషయంలో మాత్రం ఎగుమతి వైపే మొగ్గు.

ఈయన ఈ పద్ధతి అనుసరించినంత కాలం భారతదేశం ఆహార ధాన్యాలు ఎప్పటి మాదిరిగానే అమెరికానుండి దిగుమతి చేసుకోక తప్పదు. అసలీ సిద్ధాంతంలోనే పెద్ద సమస్య ఒకటుంది. ఉత్పత్తిదారు కూడా వినియోగదారేకదా! అతని జీవన ప్రమాణాలు దినదినానికి పెరిగిపోతున్నందువల్ల తను పండించేవాటికి, చక్కెర కూడా సరసమైన ధరలు, వాటికి రక్షణా కావాలని కోరవచ్చు. ఓట్లే రాజ్యం చేసే ప్రభుత్వాల్లో వ్యవసాయదారుని కోర్కెలు తేలిగ్గా కొట్టెయ్యటానికి వీలులేదు మరి!

కేంద్ర ఉక్కు పరిశ్రమలశాఖ ఇప్పుడు బొకారో ఉక్కు—మిల్లు గురించి అమెరికా ఉక్కు పరిశీలన సంఘం సమర్పించిన నివేదికను చర్చించటంలో మునిగిపోయింది. స్థాపించాలనుకున్న కర్మాగారానికిగాను సరఫరాఅయ్యే ముడి వస్తువులను సవివరంగా తనిఖీ చేయటం జరిగింది. కొన్ని నెల్ల క్రిందట చేసుకున్న నిర్ణయాన్ని లాంఛనప్రాయంగా ప్రకటించటం జరిగింది. అదేమిటయ్యా అంటే బొకారో కర్మాగారంకోసం ప్రత్యేక సంస్థను ఏర్పాటు చేయాలని నిశ్చయించింది! ఈ నిర్ణయాన్నే అమెరికా ఉక్కు పరిశ్రమల సంఘం సిఫార్సు చేసింది.

ఇంతేకాక, ఉన్న సంస్థల నిర్వహణానికి, కొత్త వాటి ఏర్పాటుకు ఒక నిర్మాణసంఘం స్థాపించాలని కూడా నిర్ణయించటం జరిగింది. ఇప్పుడున్న సామగ్రిని, ఇంకా కొత్తగా కొనే పరికరాలను ఈ సంస్థలో వినియోగించాలని, ప్రతిపాద నొకటి ఉంది. కొన్నాళ్ళపాటు ఈ సంస్థ హిందూస్థాన్ ఉక్కు—సంస్థకు అనుబంధంగా ఉన్నా, తదుపరి ప్రత్యేక సంస్థగా రూపొందుతుంది.

భిలాయ్‌లో 'బ్లాస్ట్ ఫర్నెస్' నెలకొల్పేందుకు, మూడవ ప్రభుత్వ రంగపు ఉక్కు యంత్రాగారాలతో దుక్కఇనుము ఫ్యాక్టరీలు నెలకొల్పే విషయం మీద ప్రాజెక్టు నివేదికలకోసం ప్రభుత్వం ఎదురు చూస్తోంది. భారతదేశంలో దుక్కఇనుము సరఫరాలు అధికం చేసేందుకు నిర్ణయాలు వచ్చే అక్టోబరులో చేస్తారనుకుంటున్నారు.

*        *        *

మొన్న సెప్టెంబరులో అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ సుమారు 42 మిలియన్ డాలర్ల విలువ గల ఋణాన్ని మన దేశానికి ఇచ్చింది. వచ్చే రెండేళ్ళలో టెలికమ్యూనికేషన్‌ల అభివృద్ధి పెంపుదలకు తగ్గ పరికరాలను విదేశాల్లో కొనేందుకు ఈ ఋణాన్ని వినియోగిస్తారు.

ఈ అంతర్జాతీయ సంస్థ ఇచ్చే పెట్టుబడితో కొనబోయే సామగ్రిని, అంతర్జాతీయ వేలంపాట పద్ధతినే కొనుక్కోవాలి. అప్పును 50 సంవత్సరాల్లోగా తీర్చాలి. అసలు మొత్తం తిరిగి చెల్లింపు 1973 మార్చి 1 వ తేదీనుండి ప్రారంభించాలి. అప్పటినుంచి ప్రతి ఏడాది అసలు 1 శాతంగా పదేళ్ళు, ఆ తరువాత ప్రతి ఏడూ 3 శాతంగా, తరువాత ముప్ఫై ఏళ్ళు చెల్లించాలి. ఈ మొత్తాల మీద వడ్డీ అంటూ లేకపోయినా, అసలు చెల్లింపు 1 శాతంలో సాలీనా ¾ వంతులు సంస్థ కార్యకలాపాలకుగాను 'సర్వీస్‌చార్జీ' అనే పేరుతో తీసుకోవటం జరుగుతుంది.

అన్ని పనులతోపాటు బొంబాయి, మద్రాసు, కాన్పూరు, ఢిల్లీ టెలిఫోన్ ఎక్స్ఛేంజిలకి కావలసిన పరికరాలను తెప్పించేందుకు ఈ ఋణం వినియోగించటం జరుగుతున్నది. విదేశీ సంస్థల సహాయంతో మన ప్రభుత్వం టెలిఫోన్‌ల, స్విచ్‌పరికరాల ఫ్యాక్టరీ నెలకొల్పుతున్నది. నిప్పన్ ఎలక్ట్రిక్స్ (జపాన్), యల్. యం యరిక్సన్ (స్వీడన్), నార్తరన్ ఎలక్ట్రిక్స్ (కెనడా), ఆటోమాటిక్ టెలిఫోన్ ఎక్విప్‌మెంటు కంపెనీ (బ్రిటన్), ఇంటర్నేషనల్ టెలిఫోన్, టెలిగ్రాఫ్ కార్పొరేషన్ (అమెరికా) లాంటి సంస్థలు కూడా ఈ విదేశీ సహకారంలో ఉన్నాయి. జపాన్—సంస్థనుంచి అన్నిటి కన్నా తక్కువ సహాయం లభిస్తుందనీ, తుది నిర్ణయం త్వరలోనే జరుగుతుందనీ అనుకుంటున్నారు.

*        *        *

ఎదుటివాళ్ల దృష్టి మన పురోగతికి కొలతబద్దట. గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే పథకం పరిశీలించేందుకు అమెరికన్ నిపుణుల సంఘం రెండేళ్ల క్రిందట మన దేశంకు వచ్చింది. మన గ్రామ—సమాజాభివృద్ధిని గూర్చి ఆ సంఘం ఏమన దీ ఈ క్రింద యిస్తున్నాను.

గ్రామీణ పరిశ్రమల పథకం : గ్రామాభ్యుదయమే ప్రజాభ్యుదయమనే ఉద్దేశ్యంతో సంప్రదాయసిద్ధమైనవి, గ్రామీణమైన పరిశ్రమలను వెల

కొల్పాలని ప్రతిపాదించిన వ్యక్తి మహాత్మా గాంధీ. బ్రిటిష్ పద్ధతికి ధిక్కారం, ఈ పథం ప్రకారం మహాత్మా గాంధీ, ఆయన అనుయాయులు అఖిల భారత నూలు ఉత్పత్తిదార్ల సంఘాన్ని, అఖిల భారత గ్రామీణ పరిశ్రమల సంస్థలను నెలకొల్పటం జరిగింది. చేనూలు, చేనేత పరిశ్రమలను ఉత్సాహపరచటమే పై సంస్థల ఏర్పాటుకు

## న్యూఢిల్లీ లేఖ

ముఖ్యోద్దేశ్యం. ఈ ప్రయత్నాలవల్ల గ్రామ జీవనంలో స్వయం సమృద్ధి సాధించటమే పరమావధి అని గాంధిజీ అభిప్రాయపడ్డారు. ఆ విషయాన్ని గూర్చి శ్రీ గాంధిజీ ఈ క్రింది విధంగా చెప్పారు :

"నా ఉద్దేశంలో గ్రామ స్వరాజ్యం అంటే గ్రామంకు స్వయంసత్తాక ప్రతిపత్తి గల చిన్న రాజ్యం. అంటే, వీలున్నంతవరకు ఇంకోళ్లపై ఆధారపడకుండా, స్వయం సమృద్ధం కావాలి. కాని ఏయే విషయాల్లో ఇంకోళ్లపై ఆధారపడాల్సి వస్తుందో, ఆ విషయాల్లో వాటితో భాగస్వామి కావాలి. కనుక ఇలా సమృద్ధం కావాలంటే, ప్రతి గ్రామం కూడా తిండికి కావాల్సిన ధాన్యం, బట్టకు కావాల్సిన ప్రత్తి పండించుకోవాలి. అంతేకాదు కావలసినంత పశుసంపద, వినోద కార్యక్రమాలు, పిల్లలకు, పెద్దలకు వీలుగా ఆటస్థలాలు ఏర్పడాలి. ఇవికాక ఇంకా స్థలం మిగిలిఉంటే, గంజాయి, నల్లమందు, పొగాకు మినహాగా ఉపయోగకరమైన వాణిజ్య పంటలు పండించుకోవచ్చు ప్రతి గ్రామం కూడా ఓ నాటకశాల, పాఠశాల, గ్రంథాలయం ఏర్పరచుకోవాలి. పరిశుభ్రమైన నీరు సరఫరా చేసేందుకు ప్రతి గ్రామం కూడా తన నీటి సరఫరా పథకాలను తానే ఏర్పరచుకోవాలి. ఈ సరఫరా అనేది బావుల ద్వారా, చెరువుల ద్వారా ఏర్పాటు చేసుకోవచ్చు. గ్రామాల్లో ప్రాథమిక విద్య తప్పనిసరిగా ఉండాలి. ఈ పనులన్నీ గ్రామంలో పరస్పర సహకార, సహాయ, సానుభూతులతో జరగాలి. దేశంలో అస్పృశ్యత అనే దానిని నివారించాలి. ఇప్పుడున్నట్లు కుల—విచక్షణ మనేది ఉండకూడదు."

1956 లో లఘు పరిశ్రమల పథకం క్రింద గ్రామీణ ప్రాంతాలల్లో కొంత అభివృద్ధి జరిగింది. గ్రామీణ పారిశ్రామికీకరణం ఎక్కువ చేసేందుకుగాను 26 పథకాలు, పైలట్ ప్రాజెక్టులు ఏర్పాటుచేయటం జరిగింది.

ఈ పథకం ముఖ్యోద్దేశ్యాలల్లో ఒకటేమిటంటే, సమాజ వికాస కేంద్రాల అధీన ప్రాంతాల్లో గ్రామీణ పారిశ్రామికీకరణం సాధించేందుకు వీలుగా పరిశ్రమాభివృద్ధి దళాలు నెలకొల్పటం. సగం కొత్త పరిశ్రమల నెలకొల్పటంలోను, సగం పాత గ్రామీణ సంప్రదాయసిద్ధమైన పరిశ్రమలపైన దృష్టిని కేంద్రీకరించాలని నిర్ణయించటం జరిగింది. ఈ పథకంవల్ల పల్ప్—తయారీ, పండ్లు, కాయగూరల నిలవచేయటం, విద్యుచ్ఛక్తి సంబంధమైన సామగ్రి, వాటి విడిభాగాల తయారీ, ఇంకా సామాన్యమైన ఇంజనీరింగ్ సామాన్లు, వ్యవసాయకమైన పనిముట్లు, రంపపు మిల్లులు, వడ్రంగం, బాల్చీల, ట్రంకుపెట్టెల తయారీ సంస్థలు బాగా లాభం పొందుతాయని వూహించటం జరిగింది.

ఈ 26 పథకాల్లోను 15 మాత్రమే ప్రారంభించటం జరిగింది. అందులో 9 మాత్రమే లాభసాటిగా నడిచాయి. అన్నిటికన్న లాభదాయకంగా ఉన్నవి ఖాదీ, అంబరుచర్ఖా (చేనేత) పరిశ్రమలుగా తేలాయి. వీటి విజయాన్ని కూడా చాలా ఉదారంగా ఉత్ప్రేక్షించటం జరిగింది. ఈ పథకాల గూర్చి 1959 లో జరిగిన అంచనాల్లో ఇలా పేర్కొనటం జరిగింది.

"ఈ అనుభవాలవల్ల తేలుతున్న దేమిటంటే విద్యుత్ తదితర అవకాశాలులేని ప్రాంతాలలో గ్రామీణ పరిశ్రమలు చాలా వెనుకబడి ఉన్నాయి. ఇక కొద్దిగా వెనుకబడిన గ్రామాలలో సాంప్రదాయ పరిశ్రమలకు సహాయం చేసే ప్రయత్నం ఇంకా ప్రారంభం కావాల్సి ఉంది ...." 



# సరాగమాలు

## వి ఎ కె రంగారావు

సంగీత సమీక్ష యమ్ 96225

ఘంటసాల ఇన్ని సంవత్సరాల తర్వాత భావ గీతాల వంటివి పాడటం లలిత—సంగీత ప్రియు లందరూ సంతోషించవలసిన విషయం. భావగీతా లంటే, ఈనాటి మాడర్నులు కొనరేమోననే భావంతో కాబోలు గ్రామఫోను కంపెనీవారు యిప్పాటలకు బేసిల్మె డర్నని నామకరణం చిడి నారు. ఏ పేరుతో పిలచినా, ఘంటసాల ఘంటసాల కాకపోతారా ? (ఉదాహరణకు : ఫలానా రేడియో స్టేషన్లో, జెంచులచ్చిమి పడల్తిల్ కెండశాల అని చెప్పినంత మాత్రాన వారి కంఠమాధుర్యపు వన్నె తరుగుతున్నదా ?) కొత్త పేరు పెట్టినంత మాత్రాన భావగీతం ముభావ గీతం అవుతుందా ?

ఒకప్రక్క "సింత సిగురు సిన్నదానా" భద్రి రాజు రచన. లేత వగరు రచనలో ఉంది కాని వరసలో లేదు. లేకపోతే మాత్రమేం? ప్రైవేటు రికార్డులలో హిందీ—కంపు లేకపోవటమే కొత్త దనం. హిందీ వరుసల అనుకరణలు విని విని, విసు గెత్తిన వీనుల కిది నిజంగా విందు. రెండవప్రక్క మన్న ఆరుద్ర రచన "నీ చేయి నా చేయి" కూడ ఈ ధోరణిలోనే వరుస కట్టబడింది. మొదట్లో కొంత పంకజ్మల్లిక్ పోలికలున్నా, రానురాను వరుస ఇంకా చప్పబడింది అయినా పైన చెప్పుకున్న కారణం వలనే ఇదీ వినటానికి ఇంపుగానే ఉంది

జాతీయ గీతం జి ఇ 37535

అత్యవసర పరిస్థితిని పురస్కరించుకొని కొలం బియావారు విడుదల చేసిన రికార్డిది. ఆరుద్ర రచనలను కోదండపాణి స్వరపరచగా, మాధవపెద్ది బృందం పాడారు. 'ఎర్రకోట' వరుసలో కొత్తదనం లేదు దాని అవసరం కూడా లేదేమో! భారత జనావళిలో రణోత్సాహాన్ని ప్రోత్సహించే ఉద్వేగ ఉంది. అది చాలు వెనుక కంఠాలను ఉపయో గించడం ప్రైవేటు రికార్డులలో కొత్త ప్రయో గమే. రచన సులభంగా ముక్కుకు సూటిగా ఉంది వెనుకప్రక్క "రణ భేరి" మాధవపెద్ది కంచు కంఠం మ్రోగిస్తుంది "జన్మభూమి రక్షణకై జనని పిల్చెరా" అని నిద్రాణమైన ప్రజానీకాన్ని లేవదీసేదీ మాధవపెద్ది కంఠమే. కోదండపాణి బాణిలో వాద్యగోష్ఠి చక్కగా అమరింది.

గుప్త స్వరం : ఈమని శంకరశాస్త్రిగారి ఎం ల్లుడు, ఒకప్పుడు రమేశ్‌నాయుడు—సంగీతానికి సహాయకారి, "రేణుకాదేవి" హిందీ చిత్రానికి సంగీతం అమర్చిన సంగీతకర్త, వాల్మావారి "పరువు ప్రతిష్ఠ"కు సహాయ దర్శకుడూ, కొన్ని కొలం బియా ప్రైవేటు గీతాల వరుసకారుడు ("విక సించెను మదిలో", "నీలాల నింగి లేలి") అయిన ఎమ్మెస్ శ్రీరాం ఉరఫు పట్నే శ్రీరామ్ ఉరఫు రామశాస్త్రి, "పరువు ప్రతిష్ఠ"లో ఒక చిన్న వేషం వేశారు. ఇద్దరు కుర్రకారు సైకిళ్ల మీదించి పోట్లాడుకుంటారే, అందులో ఒకరు.

పది రోజుల క్రిందట సంగీత దర్శకులు చలపతిరావుగారితో యేదో పని ఉంటే, ఇంటికి మూడుమార్లు వెళ్లగా దొరకకపోతే, రఘురాం వారి ఆఫీసులో రిహార్సలు చేస్తున్నారంటే, అక్క డకు వెళ్లాను. వారు ఇంత తీరిక లేకుండా ఉండ టానికి తగిన కారణం ఉంది. వారు యిప్పుడు పనిచేస్తున్న చిత్రాలు అయిదు. ప్రసాదార్ట్స్ వారి పేరుపెట్టని చిత్రం ఒకటి. రవీంద్రార్ట్స్ వారి 'లక్షాధికారి' రెండవది. అరుణాచల వారి తెలుగు తమిళ చిత్రాలు మరొక రెండు. రఘురాంవారి 'కలవారి కోడలు" సరికొత్తది.

ఇది ఉపోద్ఘాతం, ఇక ఉపక్రమణిక. ఆఫీసులో అడుగు పెట్టగానే "అంతా వీణామయం" వీణా ధారులైన రంగారావు (మారెళ్ల నేనుకాదు) చిట్టి బాబు, రాఘవన్, రామచంద్రన్ దర్శన మిచ్చారు వీరి మధ్యలో అప్పుడప్పుడు ఆర్మణి పెట్టె నొక్కుతూ చలపతిరావు—సహాయకులు ఆకుల అప్పలరాజు. కొంచెం దూరంగా ఇష్టజన—పరివే ష్టితుడై రాజు కూర్చొన్నట్లు కూర్చొన్న చల పతిరావు. నన్ను చూడగానే అర్ధ సింహాసన మివ్వ లేదు. కాని (అక్కడ ఉన్న కుర్చీలు యిద్దరు కూర్చొనటానికి వీలుగా ఉండవు) వేరే కుర్చీ చూపించారు. కూర్చొని పాట వినమని మౌనం గానే సూచించారు. అంతలోనే జానకి కూడా వచ్చారు. రిహార్సలు మొదలయింది; నాకు కొన్ని క్షణా లనిపించినంత సమయంలోనే అంత మయింది. రచన : నార్ల చిరంజీవి. "మంచి మనసు తెలిపేదే స్నేహము, మనిషి విలువ నిలి పేదీ స్నేహము" అని పల్లవి. మిగిలిన చరణాల రచన కూడా ఇంత ఉదాత్తంగానే ఉంది. పాట వరస (యమన్ కల్యాణి) గాని, రచన గాని "నా కళ్లు నీ వాళ్లు మన వళ్లు" అని పిచ్చివాళ్లు మీదబడి అరచినట్లు ఉండదు. వేసవిలో గాలివాటున వచ్చిన మల్లెల సౌరభంలాగ ఉంటుంది. చందమామ పూతలా, శ్రోతలకు హాయి కలిగిస్తుంది.

ఈ పాట ఆ మరుసటిరోజా శబ్దగ్రాహకులు జీవా, అరుణాచల స్టూడియోలో రికార్డు చేశారు. మరొక రెండు రోజుల తరువాత న్యూటోన్ స్టూడియోలో ప్రప్రథమంగా షూటింగ్ మొద లయింది. సినిమాలో ఈ పాట వ్రాసేది ఎస్వి రామారావు. పాడేది కృష్ణకుమారి. వీణ వాయించేది గాజీ విలన్ ప్రభాకరరెడ్డి. ఇది చిత్రంలోని మొదటి సీనే అవుతుందని దర్శకులు హేమాంబర ధరరావు అన్నారు. వారు పట్టి పాతకాలం—మనిషిలా

## నా మరిహాపాలు -4



అసలు రూపం ఆంధ్ర పత్రిక వారపత్రికకొరకు ప్రత్యేకం తీసినది.



"చదువుకున్న అమ్మాయిలు"లో సావిత్రి, నాగేశ్వరరావు.

ఉన్నారు. లేకపోతే హీరో హీరోయిన్లకు అర్థం పర్థం లేని రోలు—రోకలి డాన్సులో, మరో రకమైన వెర్రి మొర్రి వేషాలో పెట్టకుండా, లక్షణంగా, భారత సంగీత సాహిత్య సంప్రదాయాల్ని సరసంగా అందించే ఈ వీణ—పాటెందుకు ప్రవేశపెడతారు ?

మన దర్శకులలో యిటువంటి పాతకాలపు బుద్ధులున్నవారు మరికొందరు ఉంటే బాగుండును. మనం ఏటా మరో పది వీణ— పాటలు విని ఉందుము.

# సరాగమాల

ఇంతకీ నేను చలపతిరావుగారిని ఏ విషయం గురించి అడగాలనుకున్నానో, ఆ సంగతి పూర్తిగా ఆ నాలుగు రోజులూ మరచిపోయాను. "ఔరా వీణ—పాట మహిమ, తెలియ తరమా !"

సినిమాపాటలు సమీక్ష :

చదువుకున్న అమ్మాయిలు

ఈ చిత్రంలోని పాట లన్నిటికీ ఒక అందమిచ్చింది సుశీల పాడిన "వినిపించని రాగాలే" ఈ పాట యింత మధురంగా ఉండటానికి మూడే కారణాలు. దాశరథి రచన "వలపే వసంతములా, పులకించి పూచినది చెలరేగిన తెమ్మెరలే గిలిగింతలు రేపినవి, విరిసే వయసే వయసు." అందాల ప్రోవైన ఈ మాటల పొందికను గమనించి ముగ్ధులు కానివా రెవరేనా ఉంటారా ? "వలచే మనసే మనసు" అనే మాట వారి రసపోషణకు మరొక తార్కాణం. రెండవ కారణం సుశీల: జాగ్రత్తగా ఆమె పాడటం గమనించి వినండి. ఆ కంఠంలో యెన్ని కొత్త అందాలు చిందులు త్రొక్కుతున్నాయో ! ఆ విరుపుల్లో యెన్ని మెరుపులు మురిపిస్తున్నాయో !! ఆ సంగతుల్లో యెంత భావం రంగరించబడినదో ! ఆ కంఠం అంత అపురూపమైనది కాబట్టే ఆమెను సుశీల అన్నారు; తమిళాంధ్ర దేశాలలో అశేష ప్రజానీకం ఆరాధిస్తున్నారు. మూడవ కారణం: ఇంపైన వాద్యగోష్ఠితో వెలుగుతున్న రాజేశ్వర్రావు దానరస. కొట్టవచ్చే కొత్తదనం లేకపోయినా, ఆ నిర్మాణంలో ఒక మోహనత్వం, ఒక సౌష్ఠవత, ప్రత్యేకత ఉన్నాయి. సితార్ని మాత్రం సుస్మితంగా, సులలితంగా ఉపయోగించారు.

రెండవ ప్రక్క శ్రీనివాస్, కొత్త కంఠం ఆశాలత పాడిన సరదా యుగళ గీతం. ఆరుద్ర రచన "ఓహో చక్కని రచనది, తననే వినమన్నది." రాజేశ్వరరావు వరవ "నోటికి వచ్చే వరసది, మాటకి పాటన్నది." శ్రీనివాస్, ఆశాలతల కలయిక "మమతల మల్లె పందిరి, మనసుదోచినసుందరి." అమ్మాయి తెలుగు ఉచ్చారణ చక్కబరచుకొంటే, చక్కని భవిష్యత్తు ఉంటుంది.

# సందేహాలు

శ్రీ సి. రామచందర్‌గారి సంగీత దర్శకత్వంలో తయారయిన (వి. శాంతారామ్) "స్త్రీ" చిత్రంలో ఓ నిర్దయ్ ప్రీతమ్ ! అనే లతా పాడిన పాటకు తెలుగులో ఒక అనువాదం ఆ శైలిలో ఉన్నదా ? అయితే అది ప్రైవేట్ పాటా, లేక ఏదైనా సినిమాలోదా తెలుపగలరూ ?

అరవింద్‌శర్మ (భువనగిరి)

*  *  *

నాకు ఒక చిన్న సందేహం కలిగింది; తీరుస్తారనుకుంటా ! జగదేకవీరుని కథలో 'వరించి వచ్చిన మానవ వీరుడు' అనే పాటలో ఈ చరణానికి బదులు "శిలగా చేసిన మానవ వీరుడు" అని కథాసంగ్రహంలో చదివాను. రెండవ చరణమే సరియైనది కదా ! అలా పాడక, మార్చి పాడారు (వరించి వచ్చిన మానవ వీరుడు అని) కారణం ఏమిటో తెలుపుతారనే ఆశిస్తున్నాము.

ఎస్. పి. హెచ్. సీతాదేవి,

ఎస్. పి. హెచ్. రంగరామం (ఏలూరు

*  *  *

"ఓ. పి. నయ్యార్ సంగీత దర్శకత్వంలో లతా మంగేష్కర్ పాడిన పాట నాకు కనిపించలేదు (విన లేదు) అటువంటి ఉత్తమ గాయని ఆయన దర్శకత్వంలో పాడకుండా ఉండటానికి కారణ మేమైనా ఉందా ? ఒకవేళ పాడిఉంటే, ఆ పాట లేవో తెలుపుతారని ఆశిస్తున్నాను. ఈ విషయంలో చాలా మందికి సందేహం ఉంది కాబట్టి పత్రికాముఖంగా సమాధాన మిస్తే, అందరి శంక తీర్చినవారవుతారు.

మాచిరాజు రామం (నిడుమోలు) ★



'వారసత్వం' లో రామారావు, కొలవసస్వతి, గిరిజా.



కొత్తగా వచ్చిన మణిమాల 'ఈడూ జోడూ'లో

# కొత్తదనంగల 'ఈడూ - జోడూ'

నెయ్యానికి, వియ్యానికి ఆఖరి క్కయ్యాని కూడా సమమైన స్థాయి ఉండాలన్నారు. లేకపోతే ఆ పోటీ పోటీగా ఉండదన్నమాట. అలాగే వివాహాల విషయంలో కూడా జోడీ సరిగ్గా ఉండాలి అంటే ఈడుకు తగ్గ జోడు-ఉండాలన్న మాట. అలాకాక ఏ మునసో, ముతకనో పెళ్లి చేసుకున్నప్పుడు జోడీ సమంగా లేకపోవడం జరుగుతుంది. ముఖ్యంగా ద్వితీయ వివాహితునిచేసుకున్న ఆడపిల్లయితే ఆవిడ ఎంత 'మాయింటి మహాలక్ష్మి' కి మరో రూపమని అపర 'శారద' అని పేరు పొందినా ఇంట్లో మాత్రం ఈడు కతకని జోడుగా దుఃఖావహమైన జీవితం గడపవలసి వస్తుంది. ఈ సమస్యనే వీలయినంత విజ్ఞానాత్మకంగా చేయాలని దర్శకుడు శ్రీ తిలక్ నిర్మించిన చిత్రం అనుపమావారి ఈడూ—జోడు.

కథ కల్పన అన్నివిధాలా శ్రీ పినిసెట్టి రచన "పంజరంలో పక్షులు" ముఖ్య సిద్ధాంతం కనిపించే ఈచిత్రంలో శాంత (జమున) అనే పేదింటి చిన్నది తన మేనత్త కుమారుడు వేణు (జగ్గయ్య) అనే గొప్పింటి బిడ్డను ప్రేమిస్తుంది. ఆస్తి వ్యామోహంతో పడి వేణు తల్లి సుందరమ్మ (హేమలత) తన కుమారుడికి, శాంత పినతండ్రి (చదలవాడ) కూతురు శోభ (మణిమాల) ను వివాహం చేయాలనుకుంటుంది. శోభ తల్లి రంగమ్మ (సూర్యకాంతం) ఆమె అన్న చలపతి (రమణారెడ్డి) సాయంతో (ఎదేమో ఇక్కడ చెప్పకూడదు) శాంతను రెండోపెళ్లి జమీందారు లక్ష్మీపతిరావు (గుమ్మడి) కి ఇచ్చి పెళ్లి (సస్పెన్స్) చేస్తారు. శాంతను భార్యగా అంగీకరించలేని లక్ష్మీపతి కన్నకూతురుగా భావించి ఆదరిస్తుంటాడు.

లక్ష్మీపతి బలవంతంమీద ఆ ఊరులో డాక్టరుగా ప్రవేశించిన వేణు అపార్థం చేసుకుని శాంతను తూలనాడి పిదప పశ్చాత్తాపం పొందడం జరుగుతుంది. డాక్టరును పెళ్లి చేసుకోవాలనుకున్న శోభ ప్రయత్నం విఫలం కావటం, శోభను చేసుకోదలుచుకున్న ఆంజనేయమూర్తి (చలం)వల్ల వాళ్ల నాయనైన చలపతి జమీందారు దగ్గరకు వెళ్లి శాంతకు లక్ష్మీపతికి జరిగిన పెళ్లి పెళ్లికాదని చెప్పటం జరుగుతుంది. జమీందారూ, శాంత విడాకులు పొందటం, జమీందారు శాంతను బలవంతాన ఒప్పించి వేణుతో వివాహం జరిపించటం, చేసిన తప్పుకు చెంపలేసుకుని రంగమ్మ తన కూతురు శోభను అంజీ (చలం)కిచ్చి వివాహం చేయడంతో కథ ముగుస్తుంది.

చలం, జగ్గయ్య పాత్రోచితంగా నటించగా, గుమ్మడి, జమున పాత్రలకు రూపకల్పనం చేశారు. గుమ్మడి త్రాగుబోతుగా చక్కని నటన ప్రదర్శించాడు. కొత్త నటి మణిమాల పైకివచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. రమణారెడ్డి సూర్యకాంతం చదలవాడ తమ పాత్రలకు న్యాయం చేకూర్చారు. ముఖ్యంగా చలం రమణారెడ్డి చదలవాడ ఎత్తైనంత వినోదాన్ని అందించ ప్రయత్నించారు.

దర్శకత్వం ఈ సంస్థ వెనకటి చిత్రాలవలె 'అనుపమ' స్థాయిలోనే నడిచింది. అన్ని విమర్శలకు 'అతీతంగా' దర్శకులు చేయదల్చుకున్న పనిని చేశారు. దీనివల్ల శాంత పాత్ర కొంచెం ఇరుకున పడింది. ముసలివాడు తన భర్త అని తెలిసి కూడా 'పతియే ప్రత్యక్ష దైవం' అనే జ్ఞానం ప్రదర్శించిన శాంత ముసలివాడు తన భర్త కాదని తెలిసిన తరువాతకూడా ఆ వాతని ప్రేమించడం లేదన్న విషయం ఏవిధంగాను ప్రదర్శించదు. పైగా జమీందారు మళ్ళీ పెళ్ళిచేసుకోమన్నప్పుడు ససేమిరా అంగీకరించదు సరికదా ఆత్మహత్యకు పూనుకుంటుంది. జమీందారుతో వివాహం దగ్గర్నుంచి ఆత్మహత్యోద్ఘాతం అందాకా "నేను వేరొకేమీ కాను" అన్న భావాన్నే మనలో కల్గిస్తుంది. తెల్లార్పినంత మాత్రాన పెళ్ళి కాదనేస్తే కత్తినిబాపికం కట్టే వివాహాలు, లోగడ కాలంలో పిల్లా, పిల్లడూ "గాంధర్వం" అంటూ చేసుకును పెళ్ళిళ్ళన్నీ ఏమవుతాయి? ఇద్దరికీ ఇష్టంలేదన్న కనుక కోర్టు విడాకులిచ్చి అమ్మాయికి మళ్ళీ పెళ్ళికి అనుమతించిందనుకున్నా అయిష్టంలేని తనాన్ని శాంత పాత్రలో కనపించేట్లు చేయటానికి దర్శకులు ఎలాంటి ప్రయత్నమూ చేయలేదు. ఈ కారణాలవల్ల ఔన్నత్యం తగ్గిపోయే ఆ పాత్రకు బలం కలిగించే సన్నివేశాలేమైనా ఇంకా కొన్ని వుంటే చాలా బాగుండేది.

పాటల సాహిత్యం, మాటలుకూడా చాలా బిగువుగా వచ్చాయి. 'పంచర్' పాట, భజన సన్నివేశం ఈ చిత్రానికి ప్రత్యాకర్షణలు. అన్ని పాటలూ విన బుద్ధయ్యే (పెండ్యాలకపి) సంగీతంతో వున్నాయి.

వెనకటి తమ చిత్రాలవలె ఈ చిత్రంతో కూడా ఆనవాయితీ తప్పకుండా ధైర్యంగా కొత్తదనాన్ని ప్రవేశపెట్టిన శ్రీ తిలక్‌ను తప్పకుండా మెచ్చుకోవాలి.

—నాగరాజ్.

# అవీ - ఇవీ - అన్నీ

## జాతీయరక్షణనిధి సేకరణకు వెళ్లిన తారల కార్యక్రమ విశేషాలు

ఆంధ్రప్రదేశ్ ప్రజారక్షణ సమితివారు ఫతె మైదానములో ఏర్పాటుచేసిన తెనుగు ఫిలిం తారల ఉత్సవం కన్నుల పండువుగా జరిగింది. ఉపరాష్ట్రపతి డా జకీర్‌హుస్సేన్, గవర్నర్ జనరల్ శ్రీనగేశ్, ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి, తదితర మంత్రులు పుర ప్రముఖులు ఉత్సవానికి హాజరయ్యారు. సుమారు 25 వేలమంది ఉత్సవాన్ని తిలకించారు.

ప్రముఖ సినీనటులు శ్రీయుతులు అక్కినేని నాగేశ్వరరావు, ఎన్ టి రామారావు, గుమ్మడి, జగ్గయ్య రేలంగి, ఎస్ వి రంగారావు, రాజనాల, శివరాంరెడ్డి, మిక్కిలినేని, పద్మనాభం, కాంతారావు, లింగమూర్తి, రఘురామయ్య, సత్యనారాయణ, కన్నాంబ, లక్ష్మీరాజ్యం, సావిత్రి, సూర్యకాంతము, జమున, గిరిజ, కృష్ణకుమారి, రాజసులోచన, జయంతి ఈ ప్రదర్శనలలో పాల్గొన్నారు.

ఈ ప్రదర్శన కన్వీనర్ శ్రీ పి పుల్లయ్య స్వాగతం చెప్పారు. శ్రీ ఎన్ టి రామారావు దేశరక్షణకు ప్రజల కర్తవ్యాన్ని వివరిస్తూ మాట్లాడారు. ప్రతి ఇల్లు ... యుద్ధశిబిరము కావాలి, ప్రతి యువకుడు అభిమన్యుని మాదిరిగా ముందుకు వచ్చి రణరంగములోకి దుమికి చైనా— ముష్కరులను వెడలగొట్టాలి, శాంతి సత్య అహింసల ప్రాతిపదికపై సాగుతున్న నవభారత నిర్మాణానికి, స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోడానికి కంకణధారులు కావాలని శ్రీ రామారావు అన్నారు.

శ్రీ పింగళి నాగేంద్రరావు రచించిన "దేశంకోసం", శ్రీ పాలగుమ్మి పద్మరాజు రచించిన "అజ్ఞాతవీరులు", విశ్వనాథ కవిరాజు రచించిన "దొంగాటకం" శ్రీ కె జగ్గయ్య రచించిన 'రక్తతర్పణం" నాటకలను అలెగ్జాండర్ నాటకమునుండి దేశభక్తిని ప్రబోధింపజేసే రసవత్తర ఘట్టానికి చెందిన "దేశభక్తి" ని ప్రదర్శించారు. ఈ నాటకల కన్నిటి దేశభక్తి కథావస్తువు ప్రస్తుత ప్రమాద పరిస్థితిని ఎదుర్కొవడంలో ప్రజల కర్తవ్యాన్ని ఈ నాటికలు బాగా ఉద్బోధించాయి. నటీనటులంతా తమ తమ పాత్రలను సముచితరీతిని ప్రదర్శించారు.

శ్రీమతి రాజసులోచన నృత్య—ప్రదర్శన, శ్రీ రమణారెడ్డి గారడీ ప్రదర్శన, ఘంటసాల, రఘురామయ్యగార్ల దేశభక్తి గేయాలు, పాటలు, ప్రేక్షకులను చాలా ఆనందపరచాయి.

శ్రీ ఎన్ టి రామారావు నాటికల ప్రారంభములో వాటిని గూర్చి పరిచయముచేసి, ఉపరాష్ట్రపతికి, గవర్నరుకు ఆయన పూలమాలలు వేశారు.

వీరు విజయవాడ, కర్నూలు నగరాలలో కూడా ఇదే ప్రదర్శనలనిచ్చారు. వాటి ఛాయా చిత్రాలు దిగువ చూడవచ్చును.

## ఎన్ టి రామారావు వివరణ

విజయవాడ, హైదరాబాద్, కర్నూలు నగరాలలో వివిధ ప్రదర్శనల ద్వారా జాతీయ రక్షణ నిధి (సుమారు పది లక్షలు) సేకరించి ప్రభుత్వానికి అందజేసిన తెలుగు సినిమా కళాకారులు తమ ప్రజ్ఞాపాటవాలను, శక్తియుక్తులను మరోసారి ఋజువు చేసుకొని, ప్రజల అభిమానాన్ని, ప్రభుత్వాదరాన్ని పొందగలిగారు. విజయయాత్రనుంచి వచ్చిన ఈ దళ నాయకులు శ్రీ యన్ టి రామారావుగారు యాత్రా విశేషాలు ఇలా వివరించారు.



విజయవాడలో తారల ఉత్సవాలను శ్రీ ఆలపాటి ప్రారంభించారు

"మాతృదేశ రక్షణ భారం ప్రతి ఒక్కరి మీద ఉంది. అందులో మిత్రులు శత్రువులై మన మీద కురికి గుండెలమీద కుంపటిలా తయారై కత్తి కట్టినప్పుడు జాప్యం చేయకూడదు. జవాబు మరవ కూడదు. విజయం సాధించేదాకా నిద్రపోని వీర భారత జాతి మనది. ప్రపంచం గుర్తించాలి. ప్రజా నాయకుల ప్రబోధం విని, దేశం జాగృతి పొందింది, ఉత్తేజపడింది. చైనా దేశీయులను "భాయీ భాయీ" అంటూ అక్కున జేర్చిన మనమే, వారి ఆగడానికి కూడా తగిన జవాబు ఇవ్వ



రక్షణనిధికై విజయవాడలో తారల దొంగాటకం నాటకం.



ఎన్. టి. రామారావు పరిచయం



'ఈడూ జోడూ'లో జమున

గలమని ఋజువు చేశాం ప్రతి ఒక్కరూ ఈ పిలుపు విని, స్వదేశ రక్షణకు దీక్షాపరులై నిలిచారు మేం కళాకారులం, తెర వెలుగు తారకలం ప్రజా వినోద కారకులం మేం చేయగలిగిందేమిటా అని ఆలోచించుకున్నాం దర్శక పితామహులు శ్రీ పి పుల్లయ్య గారు ఈ సమాలోచనలకు సారథ్యం వహించారు ఒక నిర్దుష్ట కార్యక్రమ రచన రూపొందించాం విషయం తెలియగానే ప్రతి కళా జీవిలోనూ ఎంతో ఉత్సాహం ఉరకలు వేసింది వెంటనే ప్రత్యేక నాటికలు మా రచయితలు రచించుకోవడం, ఉత్సాహంతో వాటి ప్రదర్శనకు తయారు కావడం ప్రారంభించారంతా మన పేర్లు చూసి, మన తీరులు చూసి మురిసి పోయే అభిమానులందరికీ ఈనాడు తెరపై తారలంతా నాటక రంగంలో కూడ సామాన్యులుగాదని, వినోదపరచి, ఉత్తేజపరచి, ఈ నిధి సేకరణ చేయగలగాలనేదే మా అందరి ధ్యేయం

"మదరాసునుండి బయలుదేరే సమయానికి ఎవరికి వారు తమ తమ ప్రదర్శనల విషయంలో చక్కటి శ్రద్ధాసక్తులు కనబరచి, రిహార్సల్సు జరుపుకున్నారు రంగస్థలాలంకరణకు కావలసిన వస్తువుల నుంచి ప్రతిదీ ముందుగానే ఏర్పాట్లు చేసుకొన్నాము. ఇక్కడే ఫైనల్ రిహార్సల్సు విజయా గార్డెన్సులో జరిపాం ఒక్కొక్క ప్రదర్శనకు అవసరమైన హంగులు, కావలసిన సమయం, ఆ నాటకల్లో పాల్గొనే కళాకారులను పరిచయం చేయవలసిన తీరూ, అన్నీ చక్కగా రూపొందించబడ్డాయి నోట్సు తయారు చేశాం విద్యుద్దీపాలంకరణతో పాటుగా, చక్కటి క్రమశిక్షణతో చకచక కార్యక్రమం సాగిపోడానికి పథకాలు పూర్తయ్యాయి

"64 మంది తెలుగు కళాకారులు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు తెలుగు సినిమా రంగానికి వచ్చిన తర్వాత, తెలుగుదేశం వెళ్ళని శ్రీమతి కన్నాంబ, లక్ష్మీ రాజ్యంలవంటి కళాకారిణులు కూడా ఈ మహోద్యమానికి మాకంటె ముందు నిలిచి

# అవీ - ఇవీ - అన్నీ

రావడం ఒక మహత్తర విశేషం కళాకారులంతా ఒక్క కుటుంబం వారనేది ఈ యాత్రలో అందరికీ తెలిసింది పెద్దా, చిన్నా భేదాలులేవు స్త్రీ—పురుషులనే వేరుభావం లేదు ఒక ఇంట్లో సోదరీ సోదరుల్లా, అందరం సమాన ప్రతిపత్తితో సాగి వచ్చాం మా ప్రజలమధ్యకు వెళ్తున్నాం మేం మమ్మభిమానించిన వారి దర్శించడానికి వెళ్తున్నాం ఒక మహత్తర కార్యానికి మా అభిమాన ప్రేక్షక లోకం మా మాట మన్నించి, మా కృషికి సహకరించి ముందుకు తప్పక రాగలదనే విశ్వాసంతో, ఆనందాతిశయంతో మా బృందం కదిలింది

విచిత్రం, విశేషం ఒకటి నా కనిపించింది ఈ మహా కేంద్రాలలో ఏర్పాటు అయిన కార్యక్రమంలో ప్రజలు తమ తమ అభిమాన తారాగణాన్ని తనివిదీరా చూడవచ్చునని మాత్రమే వచ్చే వారు కాని, నా రూహించని రీతిగా, క్రమబద్ధమైన కార్యక్రమంతో చక్కటి నాటికలు, నృత్యాలు, గానాలు, మాజిక్ చూపి, వినోద పరచేసరికి తమ అభిమానులను చూడడమే గాక, ఆ అభిమానులు అందించిన వినోదానికి విస్మితులై, పరవశులై పోయారు ప్రజ ప్రతి కేంద్రంలోను, ఆ వారు ఊహించనిది కావడంతో మరింత శోభించాయి మా బృందమిచ్చిన వివిధ ప్రబోధ కార్య కలాపాలు! తెరమీది తారలు స్టేజిమీద కూడ సామాన్యులు గాదని రుజువైంది అలాంటి అభిమానాన్ని పొందగలగడం మా అందరి అదృష్టం

విజయవాడలో ప్రోగ్రాంలు ప్రారంభమయ్యాయి చక్కని బందోబస్తు జరిగింది హాయిగా, స్థాయిగా మా బృందం విజయవాడ చేరింది సరిగ్గా సమయానికి ప్రదర్శనలు ప్రారంభించాం

సారథినై, నేను స్టేజిపై వినేవాణ్ణి నాటికలను, నటీ నటులను పరిచయం చేసేవాణ్ణి క్షణం వృథా కానియ్యక, తోటి కళాకారులను తొందరజేసి (షెడ్యూలు) క్రమం తప్పని కార్యక్రమం సాగేలా చూసేవాణ్ణి సోదర నటీ నటులంతా నాపై ఆ గౌరవాన్ని చూపి, నా మాటను పాటించి, కార్యక్రమాన్ని విజయవంతంగా సాగేందుకు తోడ్పడ్డారు వారు చూపిన విశ్వాసానికి, నాపై నిలిపిన



'దిల్ ఏక్ మందిర్ (హిందీ) లో రాజేంద్రకుమార్.

గౌరవానికి సదా కృతజ్ఞుణ్ణి.

స్టేజిపై నాతో సహకరించి, మైక్సు, లైట్సు రంగాలంకరణ మొదలైనవన్నీ నిర్విఘ్నంగా జరిగేందుకు చకచక తోడ్పడ్డారు మిత్రులు, కృష్ణారావు, రాఘవేంద్రరావు, శర్మ, కృష్ణయ్యగారలు

విజయవంతంగా ముగిసింది విజయవాడ ప్రోగ్రాం ఆక్కడనుంచి హైదరాబాద్‌కు మజిలీ

ప్రజాదరణ పొందిన కళాకారుల ప్రజ్ఞా విశేషాలను ప్రభుత్వం గుర్తించి గౌరవించడం తెలుగు సినిమా పరిశ్రమకు దక్కిన మహోత్తర ఘనత ప్రభుత్వపు అతిధులం మేం ఆక్కడ ముఖ్యమంత్రి గా నీలం సంజీవరెడ్డిగారి అతిధి — మర్యాదలతో కార్యక్రమం ప్రారంభమయింది ప్రభుత్వాధికారులు మాకు చేసిన ఏర్పాట్లూ, తోడ్పాట్లూ ఇన్నీ, అన్నీ కావు, వారికి మా పరిశ్రమ ధన్యవాదా లర్పిస్తోంది

# ఆవీ ఇవీ అన్నీ

కారుతో— ఆ దారిలో పెళ్ళికి తరలి వెళ్ళిన వారిలా అంతా ఆనందంతో ఆటలు, పాటలు చమత్కారాలు ఖుషీగా ప్రారంభించి ప్రయాణంలో దూరాన్ని మరపించేశారు

బొంబే— ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు చేరుకున్నాం సుమారు పది లక్షల నిధి వసూలయిందని అంచనా వేశారు

జరిగినది మూడు కేంద్రాలలో మూడు రోజుల కార్యక్రమమే గాని, ఇంతమంది కలసి మెలసి కాలక్షేపం చేయగలగడంతో విడివడని అనుబంధమేర్పడింది మద్రాస్ చేరువవుతోందంటేనే ఒక భయం, బాధ ప్రారంభించాయి కళాకారులం కావడంతో, మద్రాస్ చేరితే ఎవరికి వారుగా, ఎవరి కాల్‌షీట్ల గొడవ వారుగా విడిపోవాలి తీయటి బాధ తెలెత్తింది



కొడుకులు కోడళ్లు లో ఒక దృశ్యం

ఆనాటి ప్రదర్శనలకు మన ఉపరాష్ట్రపతి డా జకీర్ హుస్సేన్, మన ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ నగేష్ విచ్చేసి మమ్మల్ని అభినందించడం మరువరాని మధుర సన్నివేశం అది మన తెలుగు సినిమా చరిత్రకే చిరస్మరణీయమైన విశేషం ప్రత్యేక ఘనత ప్రదర్శనలు ముగిసిన తరువాత వేదికపైకి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు వచ్చి, పేరు పేరునా ఈ కళాకారులను పిలిచి, మాలలతో సత్కరించి, ఆదరించి, గౌరవించడం పెద్ద విశేషం ప్రతి ఒక్కరూ పొందిన ప్రత్యేక విశిష్టత కళ ప్రభుత్వాదరణ పొంద గలిగింది ఈ పరిశ్రమ ప్రభుత్వ దృష్టి నాకర్షించ గలిగింది కళాకారులు చేయలేనిది లేదని బుజువు చేయగలిగింది పరిశ్రమ చరిత్రకిది ప్రత్యేక అధ్యాయమేనని చెప్పాలి కళాకారులందరికీ తమ ఇంట గ్రీన్‌లాండ్స్‌లో విందుచేసిన శ్రీ సంజీవరెడ్డిగారికి ప్రత్యేకంగా పరిశ్రమ తరఫున నా కృతజ్ఞతాంజలి సమర్పిస్తున్నా

హైదరాబాద్‌నుండి కర్నూలుకు చేరాం గుత్తివరకు అందరం ఒకే బస్సులో ప్రయాణం చేశాం పరస్పరాభినందనలతో ప్రారంభమయ్యాయి భారంగా ఒకరి కొకరం వీడ్కోలిచ్చుకున్నాం బరువెక్కిన హృదయాలతో ఏదో తెలియని ఆత్మీయత పెనవేసుకున్న మేమంతా మళ్లీ మా లౌకిక ధర్మపాలనకు విడిపోతున్నాం మధుర సంస్మృతి— విచిత్ర విరహం ఒకేసారి దాడి చేశాయి మామీద ఏం చేస్తాం? ఒక విశిష్ట కార్యక్రమంలో పాల్గొన్న సంతృప్తితో ఎవరిళ్లకు వాళ్ళు చేరిపోయాం ఆంధ్ర ప్రజ చూపిన గౌరవాదరణలకు నా కృతజ్ఞత చూపుతున్నా నిరవధికంగా దేశానికి, సంఘానికి, నా సేవ నిత్యం సిద్ధంగా ఉంటుంది నాతో బాటు నా సాటి కళాకారులంతా దీక్షగలవారే!

## గానకచేరి

ఈమధ్య శ్రీమతి నాగవర్ధని మృదంగ వాద్య ప్రదర్శన నిమిత్తం మదరాసు టి నగర్‌లోని వాణీ మహల్‌లో కచేరీ జరిగింది

గానసభ ప్రారంభంలో ప్రముఖ చలన చిత్రనటుడు, నిర్మాత—దర్శకుడు, అయిన శ్రీ నాగయ్యగారు, సంగీత శాస్త్ర రత్నాకర ప్రొఫెసర్ సాంబమూర్తి (మద్రాస్ సంగీత విద్యాలయ దర్శకులు, కెరుల సంగీత నృత్య కళాశాల ప్రొఫెసరు) గారిని పూలమాలాలంకృతులనుజేసి అధ్యక్షత వహించవన్నారు.

ఈ కచేరీలో గాన భూషణ శ్రీమతి కళా అనంతలక్ష్మి—గాత్రం, ఎయిర్ ఆర్టిస్ట్ శ్రీమతి దారి నాగవర్ధని—మృదంగం, శ్రీహరి అచ్యుత రామశాస్త్రి—వయొలిన్ వాయిద్యం పక్కవి

## సెట్టుమీద 'అమరశిల్పి జక్కన'

గోవదేవుడు రాజా సంస్థానంలో రాజనర్తకిగా తన కుమార్తె మంజరిని (బి సరోజాదేవి) ప్రవేశ పెట్టాలని, ఆ రాజు తను —వారసత్వాలని రాజమ్మ 'సూర్యకాంతం' ఉద్దేశ్యం కాని, ఆ ఊరికొచ్చి శిల్పి అయిన జక్కన్న (నాగేశ్వరరావు)కు మనసిచ్చి తన పొందు కోరాలనుకుంటుంది మనసిచ్చింది, రహస్యంగా కలుసుకుంటున్నారు ఇద్దరిమధ్యా మమతలు పెరుగుతున్నాయి రహస్యాన్ని తెలుసుకున్న రాజమ్మ మంజరిని, వారి ఇంటి మేడ పై గదిలో బంధిస్తుంది తన మంజరి రానందున, తన బుర్రకు పని కల్పించాడు జక్కన ఊహించాడు, బయిలు దేరాడు రాజమ్మ—ఇంటిమేడ పై కెక్కి, మంజరి ఉన్న గదిలో దొంగతనంగా చొరబడ్డాడు మంజరిని కలుసుకుంటాడు

"మంజరి? మంజరి!"

"స్వామీ!"

"ఏమిటీ కారాగారం?"

"ఇదంతా మా అమ్మ ప్రతాపం స్వామీ! మనకు ఋణం తీరిపోయింది మీ అనురాగానికి నేను నోచుకోలేదు"

"మంజరీ! మన ప్రేమలు ఎవరూ మాపలేరు మనల్ని వేరు చేయలేరు దేవీ!"

"ఎవర్రా అక్కడ? సుందరం?—ఏం చేస్తున్నావురా" అంటూ రాజమ్మ, తమ్ముడు సుందరంతో, 'గదిలోని గుసగుసలు వినబడుతున్నాయి'— అంటుంది

ఈ సన్నివేశము విక్రమ్ ప్రొడక్షన్సువారి "అమరశిల్పి జక్కన" లోనిది ఈ చిత్రానికి ఛాయ— నిర్మాత—దర్శకుడు బి యస్ రంగా కథ— మాటలు సముద్రాల రాఘవాచార్య, పాటలు: సి నారాయణరెడ్డి, దాశరథి, సముద్రాల (సీనియర్), కొసరాజు సంగీతం - ఎస్ రాజేశ్వరరావు, కళ శేఖర్, నృత్య దర్శకులు హీరాలాల్, దండాయుధపాణి, చోప్రా, వి జె శర్మ అండ్ సరస

పదమూడు రీళ్ల చిత్రం పూర్తి అయింది సెప్టెంబరు మాసానికి షెడ్యూలు ప్రకారం ఈ చిత్రాన్ని పూర్తి చేయాలని శ్రీ రంగా కృషి చేస్తున్నారు 7 పాటలు, 6 పద్యములు, ఒక భరత నాట్య సంగీతం (పాట లేకుండా) రికార్డు చేయబడ్డాయి 5 పాటలను, భరత నాట్య సంగీతం (పాట లేకుండా రికార్డయినది) చిత్రీకరించారు 2 పాటలు చిత్రీకరించాలి

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, రేలంగి, నాగయ్య, హరనాథ్, ధూళిపాళ, ఏ వి సుబ్బారావు (జూనియర్), ఉదయకుమార్, బి సరోజాదేవి, గిరిజ, సూర్యకాంతం, రాజశ్రీ పుష్పవల్లి మొదలగువారున్నారు

దాశరథి వ్రాసిన పాట

"అందాల బొమ్మతో ఆటాడవా—
పసందైన ఈ రేయి నీదోయి స్వామి"

పి సుశీల పాడగా, లోగడ రికార్డు చేశారు.



ఇ టా లి య న్ అం దా ల తా ర రో సా నా పో డె స్టా

# అవీ ఇవీ అన్నీ

## జగపతివారి తాజా చిత్రం

జగపతివారు తమ తాజా చిత్రానికి ఈమధ్య మూడు పాటలను రికార్డు చేశారు ఈ మూడు పాటలను కూడ ఆత్రేయ వ్రాశారు ఒక పాట సుశీల పాడింది రెండవది ఘంటసాల పాడారు మూడవది ఘంటసాల పాడగా, సుశీల మధ్య మధ్యన హమ్మింగ్ ఇచ్చింది సంగీతం కె వి మహదేవన్, మాటలు—ఆత్రేయ, ఛాయ—సి నాగేశ్వరరావు, దర్శకుడు—వి మధుసూదనరావు, నిర్మాత రాజేంద్రప్రసాద్ "అగ్ని సంస్కార్" అనే బెంగాలీ నవలాధారంగా ఈ చిత్రాన్ని తీస్తున్నారు

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, బి సరోజాదేవి జగ్గయ్య, రేలంగి, రమణారెడ్డి, గిరిజ మొదలగువారున్నారు

షెడ్యూలు ప్రకారం జూన్ 19 నుండి హైద్రాబాద్ సారథి స్టూడియోలో షూటింగ్ ప్రారంభమవుతుంది

## "తోబుట్టువులు"

సాధనావారి చిత్రం "తోబుట్టువులు" పూర్తయింది జూన్ నెలలో విడుదల చేస్తారు ఈ చిత్రంలో సావిత్రి, కంతారావు, జమున, జగ్గయ్య, శారద, చలం—ఈ మూడు జంటలే గాక, ఇంకా యస్ వి రంగారావు, శాంతకుమారి, పద్మనాభం, మీనాకుమారి, రాజబాబు మొదలగువారున్నారు

ఈ చిత్రానికి రచన ఉనిసెట్టి, ఛాయ కమల్ ఘోష్, సంగీతం మోహన్‌దాస్, నిర్మాత—దర్శకుడు రంగనాధదాస్

## వైజయంతిమాల నాట్యం

సీలిగిరి ప్రాంతానికి ఒక ధర్మాసుపత్రి నిర్మించేందుకు అక్కడివారు చందా వసూలు చేస్తున్నారు ప్రముఖ నర్తకి వైజయంతిమాల ఈ సందర్భంలో ప్రతిఫలం లేకుండా, ఊటీలో ప్రదర్శన ఇచ్చింది వసూలైన డబ్బును హాస్పిటల్ నిర్మాణ కమిటీవారు తీసుకున్నారు వైజయంతి ఈ ప్రదర్శనలో ఒక ప్రత్యేక ప్రదర్శనిచ్చి ప్రేక్షకుల్ని తన్మయుల్ని చేసింది ఈ ప్రదర్శనాన్ని మద్రాసు గవర్నరు శ్రీ విష్ణురాం మేధి, సతీ సమేతంగా తిలకించారు శ్రీ మేధి వైజయంతిని అభినందిస్తూ, ఆమె ప్రదర్శనలు చాలాసార్లు చూశానని, కాని ఈ విధంగా ఎప్పుడూ లేదని—ఈవిధంగా కళాకారులందరూ దేశ సౌభాగ్యంకోసం ముందంజ వేయడం అపూర్వం—ఆనందం అని అన్నారు గవర్నరు—సతి వైజయంతిమాలకు వెండి పళ్లెరం బహూకరించింది చివరకు నిర్వాహకులు వైజయంతిమాలకు, గవర్నరు దంపతులకు పూలమాలలు వేశారు

## జి. వరలక్ష్మి పందెం

జి వరలక్ష్మి తన బర్త్ అజిత్ సింగ్‌పై కుస్తీలో గెలిస్తే, రూ 5000 లు బహుమతి ఇస్తానంటూ పవార్ చేంది ఎవాల్‌ను ఎదుర్కొంటూ కింగ్‌కాంగ్ పందెం వేశాడు అజిత్ సింగ్‌తో, కింగ్ కాంగ్ మల్లయుద్ధం చేశాడు ఇద్దరూ సుమారు 50 నిమిషాలు [illegible]



'శాబాలీఖాన్'లో నాట్యతార హెలెన్.

(దిగువ) 'తోబుట్టువులు'లో ఒక దృశ్యం.



# అవీ - ఇవీ - అన్నీ

గోదానుండి ఇద్దరూ క్రింద పడ్డారు. అయినా కుస్తీ పడుతూనే ఉన్నారు చివరకు కింగ్‌కాంగ్ ఓడిపోయాడు. అంటే, అజిత్‌సింగ్ తరఫున అయిదువేల రూపాయలు పందెం వేసిన జి. వర లక్ష్మి పందెంను గెలుచుకుంది.

## ప్రమాదం తప్పిన శ్రీధర్

"పెళ్ళికానుక" దర్శకుడు "నెంజిల్ ఒర్ ఆలయం" అనే తమిళ చిత్రాన్ని నిర్మించి, దర్శకత్వం వహించాడు. ఆ చిత్రం హిట్ అయింది అదే కథా వస్తువును హిందీలో "దిల్ ఏక్ మందిర్" చిత్రాన్ని నిర్మించాడు, దర్శకత్వం వహించాడు. ఈచిత్రం విడుదలకు శ్రీధర్, కెమేరామేన్ విన్సెంట్‌తో కలసి మద్రాసునుండి కలకత్తాకు విమానంలో



కుమారి ఇందిర భరతనాట్యం.

బయలు దేరాడు. కలకత్తా విమానాశ్రయం డండంలో ఈ విమానం 75 నిమిషాలలో దిగ తుందని ప్రకటించబడ్డది. అదే సమయంలో ఆ విమానం అకస్మాత్తుగా కలిగిన గాలి—వాన—పెద్ద తుఫాన్‌లో చిక్కుకుంది. మార్గం తెలియలేదు. ఇతర ప్రయాణికులు ఆ విమానంలోనుండి క్రిందకు దూకుదామనుకున్నారు ఆ విపత్తులోనుండి కాపాడమని శ్రీధర్ తిరుపతి వెంకటేశ్వరస్వామిని కోరుకున్నాడు, దర్శనం చేసుకుంటా నన్నాడు విమానం అతికష్టంమీద డండం విమానాశ్రయంలో దిగవలసినదానికి బదులు కొంతదూరంలో ఈమధ్య చైనా దాడుల రక్షణ నిమిత్తం ఏర్పర్చబడ్డ కొత్త విమానాశ్రయంలో దిగింది. తుఫాన్ వెలసిన తరువాత ఆ విమానం కలకత్తాకు బయలుదేరి సురక్షితంగా చేరింది.

## భీముడ గా 'రాజగోపాల్'

రాజ్యం పిక్చర్సువారి "నర్తనశాల" చిత్రంలో భీముడుగ దండమూడి రాజగోపాల్ నటిస్తున్నాడు తను చిన్న వయస్సులో ఒక్కసారి "ద్రౌపదీ వస్త్రాపహరణం" నాటకంలో భీముడుగా వేషం వేశాడు. ఈయన ఆల్ ఇండియా వైయిట్ లిఫ్టింగ్ అసోసియేషన్‌లో సభ్యులు.

పల్నాటియుద్ధం చిత్రంలో కన్నమదాస్ పాత్ర వేయడానికి కీ॥ శే॥ గూడవల్లి రామబ్రహ్మంగారు పిలిచారు. కాని సినిమాలంటే ఇష్టంలేనందు వలన రాలేదు. ఉయ్యూరు దగ్గర గండిగుంట గ్రామం జన్మస్థలం. ఆ గ్రామంలో ఒకేఒక వీర హనుమాన్ దేవాలయం ఉంది. అతనే రాజగోపాల్ ఇష్టదైవంకూడా, శిథిలావస్థలో ఉన్న ఆ వీర హనుమాన్ దేవాలయానికి ఈ మధ్య రెండువేల రూపాయలు విరాళమిచ్చి బాగు చేయించారు. వీరికి చిత్రాలలో హనుమాన్‌పాత్ర వేయాలనే కోరిక ఉంది.

## కానిస్టేబుల్ కూతురు

కానిస్టేబుల్ కూతురు చిత్రం సెన్సారైంది. వాహినీ స్టూడియో మూడవఫ్లోర్‌లో సంగీత దర్శకుడు గోవర్ధన్ పెద్ద ఆర్కెస్ట్రాతో విన సొంపైన సంగీతాన్ని రీరికార్డింగ్ ద్వారా కానిస్టేబుల్ కూతురు చిత్రానికి సమకూరుస్తున్నారు ఈ చిత్రం యీ నెల 31 తేదీలో విడుదలవుతుం

* * *

అరుణాచలం స్టూడియోలో ఎ. కె. వేలన్ సాంఘిక చిత్ర మొకటి నిర్మించాలని ప్రయత్నాలు చేస్తున్నట్లు, యిందులో ఎన్. టి రామారావు, దేవిక నటిస్తారని తెలుస్తోంది.

* * *

పద్మజా పిక్చర్స్ అనే సంస్థ తీయాలనుకుంటున్న ఒక సాంఘిక చిత్రానికి బి. టి. నరసింహాచారి కథను, గోటేటి ఒక పాటను తయారు చేస్తున్నారని తెలుస్తున్నది.

## హిందీ చిత్రాలు

దక్షిణ భారతంనుండి హిందీ చిత్రాలకు దర్శకులుగా వెళ్ళిన ప్రముఖ దర్శకులలో తాతినేని ప్రకాశరావు ఒకరు వరుసగా శ్రీయుతులు కృష్ణన్ పంజా (బర్‌ఖా, షాదీ), భీమ్‌సింగ్ (మై చుప్ రహూంగీ అండ్ రాఖీ), ఎ శంకర్ తర్వాత శ్రీ ప్రకాశరావుగారు నాల్గవవారు ససురాల్, హం రాహీ వీరి భాక్సాఫీసు చిత్రాలు.

## "సాత్రీ"

నిర్మాత—దర్శకుడు శ్రీ రాజఋషి (రాజ్ కళా) నిర్మాణంలోఉన్న తన చిత్రం "సాత్రీ" కి ఫిలిం ఫైనాన్స్ కార్పొరేషన్ ఆర్థిక సహాయం లభించడంతో, ఔట్‌డోరు దృశ్యాల పరిశీలనకై రాజస్థాన్, ఢిల్లీ నగరాలకు ప్రయాణమైనారు. ఈ చిత్రంలో అశోక్‌కుమార్, భరత్‌భూషణ్, సుదేష్ కుమార్, నజీర్ హుస్సేన్, శ్రీమతి శారద వగైరాలున్నారు. తాజ్‌మహల్ చిత్రానికి తాజా సంగీతమిచ్చిన శ్రీ రోషన్ సంగీతం సమకూరుస్తున్నాడు.

సి. డి. ★


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras 1. Chief Editor . S. Sambhu Prasad.



జయంతి

అందమైన ముఖ వర్చస్సునకు
ఎక్కువ కాలం నిలిచే పరిమళమునకు

# రెమి

టాల్కమ్ పౌడర్